# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు

*



ఇవి గాక ఫొటో, శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

*


విడి ప్రతి 75 పైసలు

సంవత్సర చందా రూ. 9/-




- Minors above the age of 14 years can open SAVINGS ACCOUNTS.
- Rs. 5/- is all that is required to open an account.
- Even as little as a Rupee can be deposited into the account.
- Withdrawals also can be made.
- 4% Interest on monthly minimum balances.

For further particulars, please enquire at our branch nearest to you, or write to us.



**THE ANDHRA BANK LIMITED**

(The Bank For Friendly Service)

Regd. Office: Machilipatnam Central Office: Hyderabad (A.P.)

K. S. DUTT
Chairman

T. R. BHAGAVAT
General Manager

## బలము మరియు శక్తి కోసం — బోర్న్‌విటా!

## బోర్న్‌విటా రుచి సాటిలేనిది..

### ఇందుకు కిటుకు — కోకో!




బలము, శక్తి మరియు రుచి కోసం

**క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా**

## Statement about ownership of CHANDAMAMA (Telugu)

### Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | "CHANDAMAMA BUILDINGS" |
| | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each Calendar month |
| 3. *Printer's Name* | : | B. V. REDDI, |
| *Nationality* | | INDIAN |
| *Address* | | Prasad Process (Pvt) Ltd.,<br>2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 4. *Publisher's Name* | : | B. VISWANATHA REDDI, |
| *Nationality* | | INDIAN |
| *Address* | | Managing Partner, Sarada Binding Works,<br>2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 5. *Editor's Name* | | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 6. *Name & Address of individual/* | : | SARADA BINDING WORKS : |
| *who own the paper* | : | PARTNERS, |
| | | 1. Sri B. Viswanatha Roddi,<br>2. Sri B. L. N. Prasad,<br>3. Sri B. Venugopal Reddi,<br>4. Sri B. Venkatrama Reddy,<br>5. Smt. B. Seshamma,<br>6. Smt. B. Rajani Saraswathi,<br>7. Smt. A. Jayalakshmi,<br>8. Smt. K. Sarada. |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March, 1963*

B. VISWANATHA REDDI,
*Signature of the Publisher*



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

---

ఈ నెల బేతాళకథ ["మిత్రద్రోహం"] జితేంద్ర అనే పాఠకుడు పంపినది.

అదుపు గాని ఆవేశాలు మనుషులను ఎలాటి తప్పుదారులు తొక్కిస్తాయో చూపటానికి ఈ సంచికలో కొన్ని కథలున్నాయి.

"దౌర్జన్యం" అన్న కథలో చండవర్మ అనేవాడు రాజకుమార్తెను హరించ యత్నించి నాశనమవుతాడు. "నేర్పుగల తీర్పు"లో రామయ్య తన ఈర్ష్యకు తానే గురి అవుతాడు.

---

సంపుటి 42 మార్చి '68 సంచిక 3



# భారత చరిత్ర



నిజాము తనను వదిలి ఇంగ్లీషువారితో చేరినా హైదరు యుద్ధం మానక, బొంబాయి సేనలను ఓడించి మంగళూరు తిరిగి స్వాధీనం చేసుకుని, 1769 మార్చిలో మద్రాసుకు అయిదు మైళ్ళ దూరంలోకి వచ్చి, ఇంగ్లీషువారిని సంధికి బలాత్కారంగా ఒడబరిచాడు (1769 ఏప్రిలు 4). ఈ సంధి ననుసరించి, హైదరాలీ పైన ఎవరైనా ఎత్తి వస్తే, తాము అతనికి సహాయపడతామని ఇంగ్లీషువారు మాట ఇచ్చారు.

అయితే ఈ ఒప్పందాన్ని మద్రాసు ప్రభుత్వం అమలు చెయ్యలేదు. 1771 లో మహారాష్ట్రులు హైదరుపై దాడి చేసినప్పుడు వారు అతనికి సహాయం వెళ్ళలేదు. అందుచేత హైదరు ఇంగ్లీషువారి పై తిరిగి దెబ్బ తీసే అవకాశం కోసం ఎదురు చూడసాగాడు. అతను 1779 లో ఇంగ్లీషువారికి వ్యతిరేకంగా ఏర్పడిన సంఘటనలో చేరాడు.

1780 జులైలో హైదరు 80 వేల సైనికులతోనూ, 100 ఫిరంగులతోనూ కర్ణాటక మైదానాల పై "ఉప్పెన లాగా" వచ్చి పడి, కర్నల్ బేలీ అనే వాడి నాయకత్వం కింద ఉండిన ఇంగ్లీషు దళాన్ని ఓడించి, అక్టోబరులో ఆర్కాటును పట్టుకున్నాడు. ఇంగ్లీషు కంపెనీ ఇరుకున పడింది.

అయితే గవర్నరు జనరలైన వారెన్ హేస్టింగ్స్, తన సర్వసేనాని కింద కొంత సేనను హైదరు పైకి పంపటమే గాక, హైదరు నుంచి బీరారు రాజునూ, నిజామునూ, మహాదాజీ సింధియానూ చీల దీశాడు. అయినా ఇవేవీ లక్ష్యపెట్టక, హైదరు తన శక్తి కొద్దీ యుద్ధం సాగించి, 1781 లో పోర్టోనోవో వద్ద ఓడిపోయాడు.

ఇంగ్లీషువారితో అటో, ఇటో తేల్చుకోకుండానే హైదరు, 1782 డిసెంబరు 7 న పుట్టవ్రణంతో చనిపోయాడు.

78. మైసూరు యుద్ధాలు



హైదరు అనంతరం అతని కొడుకు టిప్పు ఇంగ్లీషువారితో పోరాటం కొనసాగించాడు. బ్రిటిషువారి సర్వసేనాని అయిన బ్రిగేడియర్ మాథ్యూస్‌నూ, అతని అనుచరులనూ టిప్పు 1783 లో పట్టుకున్నాడు.

కొత్త ఇంగ్లీషు గవర్నరు మకార్ట్నీ టిప్పు వద్దకు సంధి రాయబారం పంపాడు. 1784 మార్చిలో మంగళూరు సంధి జరిగింది. ఈ సంధి గవర్నరుజనరలు వారన్‌హేస్టింగ్సుకు ఏ మాత్రమూ నచ్చలేదు.

ఇది వట్టి శుష్కసంధి అనీ, ఇంగ్లీషువారితో తనకు యుద్ధం తప్పదనీ టిప్పుకు తెలుసును. అతను ఊహించినట్టే ఇంగ్లీషువారికీ, మైసూరుకూ మూడోసారి యుద్ధం వచ్చింది. అందుకు కావలసిన పరిస్థితులను కొత్త గవర్నరుజనరలు కార్న్‌వాలిస్ (1786-1793) కల్పించాడు. ఆయన 1788 లో నిజాము నుంచి గుంటూరును స్వీకరించాడు; 1789 జులై 7 న నిజాముకు లేఖ రాస్తూ, టిప్పు పేరు ప్రస్తావించకుండా నిజాముతో "శాశ్వత సహకారం" ఏర్పాటు చేసుకునే సూచన చేస్తూ, దాన్నే ఒడంబడిక పత్రంగా పరిగణించమన్నాడు. ఈ విధంగా కార్న్‌వాలిస్ 1784 సంధిని నీరుగార్చేశాడు.



ఈ పరిస్థితిలో టిప్పు 1789 డిసెంబరు 29 న తిరువాన్కూరు పైన దాడి చేశాడు. మంగళూరు సంధి ప్రకారం ఇంగ్లీషువారి సహాయానికి అర్హత గల తిరువాన్కూరు రాజా మద్రాసు గవర్నరు (జాన్ హాలండ్)ను సహాయం అర్థించాడు. మద్రాసు గవర్నరు నుంచి సహాయం రాలేదు. కార్న్‌వాలిస్ మద్రాసు ప్రభుత్వ చర్యను నిరసించాడు. మరి కొద్ది మాసాలకు (1790 జూన్, జులై లలో) నిజామూ, మహారాష్ట్రులూ కూడా ఇంగ్లీషువారితో త్రిపక్ష ఒడంబడికలు చేసుకున్నారు. అటు తరవాత ఇంగ్లీషువారికీ, మైసూరుకూ మూడవ సంగ్రామం జరిగింది.



రెండు సంవత్సరాలుగా సాగిన ఈ సంగ్రామంలో మూడు యుద్ధాలు జరిగాయి. మొదటి యుద్ధంలో ఇంగ్లీషు సేనాని కన్న టిప్పు ఎక్కువ యుద్ధనైపుణ్యం చూపాడు. అందుచేత రెండవ యుద్ధానికి కార్న్‌వాలిస్ స్వయంగా సేనాపతిత్వం వహించి, తన సేనలను వెల్లూరు, అంబూరుల మీదుగా నడిపించుకుంటూ వచ్చి, 1791 మార్చి 21 న బెంగుళూరు పట్టుకున్నాడు. తరవాత అతను మే 13 న అరికెరా చేరాడు. టిప్పు రాజధాని అయిన శ్రీరంగపట్టణానికి ఇది 9 మైళ్ళ తూర్పుగా ఉన్నది. అయితే ఈ యుద్ధంలోనూ టిప్పు యుద్ధనైపుణ్యమే రాణించింది.

తిరిగి యుద్ధం సాగినప్పుడు టిప్పు కోయంబత్తూరును పట్టుకున్నాడు (నవంబరు 3). అయితే, అతను శ్రీరంగపట్టణానికి తిరిగి వచ్చే దారిలో గల కొండ దుర్గాలను కార్న్‌వాలిస్, బొంబాయి నుంచి సహాయం వచ్చిన దళాలతో ఆక్రమించి, 1792 ఫిబ్రవరి 5 న శ్రీరంగపట్టణం శివార్లను ముట్టడించాడు.

టిప్పు తన రాజకీయ విజ్ఞతను ఉపయోగించి సర్వనాశనం కాకుండా తప్పించుకున్నాడు. కాని ఇకమీదట ఘర్షణ వల్ల ఫలితం ఉండదని అతనికి తెలిసిపోయింది. సంప్రతింపుల అనంతరం, 1792 మార్చిలో శ్రీరంగపట్టణం ఒడంబడిక జరిగింది. టిప్పు తన రాజ్యంలో సగం వదులుకోవలసి వచ్చింది. కృష్ణాతీరం నుంచి, పెన్నారు నదిని దాటిన ప్రాంతాన్ని నిజాముకూ, మరి కొంత భాగాన్ని మహారాష్ట్రులకూ ఇవ్వవలసి వచ్చింది. దీని మూలంగా మహారాష్ట్రుల సరిహద్దు తుంగభద్ర దాకా విస్తరించింది. మలబారూ, కూర్గు రాజా పై పెత్తనమూ, దిండిగల్లూ, దాని పరిసరాలూ, 30 లక్షల సవరన్లకు పైబడిన పరిహారమూ ఇంగ్లీషు వారికి దక్కాయి.





# కర్ణార్జునుల జన్మరహస్యం

దేవగణాలకు అగ్రగణ్యుడైన దక్షప్రజాపతి ఒక మహా యజ్ఞం చేయ తలపెట్టాడు. ఆ సందర్భంలో ఆయన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులతో బాటు గరుడ, గంధర్వ, యక్ష, కిన్నర, సిద్ధ, విద్యాధర గణాలవారి నందరినీ ఆహ్వానించాడు. యజ్ఞశాల దేవతలతోనూ, నారదాది మునులతోనూ కనుల పండువుగా ఉన్నది.

యజ్ఞం ప్రారంభించే ముందు ఎవరైనా పెద్దకు అధిపత్యం ఇవ్వాలి. ఆ గౌరవం త్రిమూర్తులలో ఎవరో ఒకరికి ఇవ్వాలి. కాని ఎవరి కివ్వటమా అని దక్షుడు తికమక పడ్డాడు. బ్రహ్మ సాక్షాత్తూ సృష్టికర్త, విష్ణువు సర్వశక్తిమంతుడూ, జిత్తులమారి కూడానూ, ఈశ్వరుడు ముక్కోపి, ఉగ్రుడూనూ. వీరిలో ఏ ఒకరిని అధిపతిగా ఎన్నుకున్నా మిగిలిన ఇద్దరికీ అవమానం అయినట్టు తోచవచ్చు.

ఈ చిక్కు విడక దక్షుడు నారదుణ్ణి చాటుగా పిలిచి, అతని సలహా అడిగాడు.

నారదుడు దక్షుడితో, "నీ కెందు కీ సమస్య? తాంబూలం ముగ్గురి ఎదటా ఉంచి, ఎవరో ఒకర్ని అధిపత్యం వహించి తాంబూలం పుచ్చుకోమను. ఆ తరవాత వాళ్ళే తేల్చుకుంటారు." అన్నాడు.

దక్షుడు అలాగే చేశాడు. త్రిమూర్తులు ఒకరి నొకరు చూసుకున్నారు. బ్రహ్మ తనకు యజ్ఞాధిపత్యం అవసరం లేదన్నట్టు తల అడ్డంగా తిప్పేశాడు. విష్ణు మహేశ్వరులు ఒకరి నొకరు క్రీగంట చూసుకున్నారు. అవతలివాడు విరమించుకుంటే తాను తాంబూలం పుచ్చుకోవాలని ఇద్దరికీ ఉన్నది. ఇద్దరికీ ఒకరంటే ఒకరికి భయం కూడా ఉన్నది.

ఈ పరిస్థితిలో విష్ణువే సాహసించి, చెయ్యి చాచి తాంబూలం తీసుకున్నాడు.

టి. సుబ్బారావు

మాటవరసగానైనా తన అనుమతి పొందకుండా విష్ణువు ఇలా చేశాడని శివుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆయన ఆ క్రోధావేశంలో తన త్రిశూలాన్ని గట్టిగా భూమిలోకి నాటాడు.

అప్పుడు భూమిలో నుంచి ఒక మహాకాయుడు ఆవిర్భవించాడు. వాడికి శరీరం మీద ఏడు కవచాలూ, కర్ణకుండలాలూ, ధనుర్బాణాలూ ఉన్నాయి.

శివుడా మహాకాయుణ్ణి దీవించి, వాడికి విష్ణువును చూపించి, ''వాడి సంగతి చూడు,'' అని ఆజ్ఞయిచ్చి కైలాసానికి వెళ్ళిపోయాడు.

ఆ మహాశక్తి విష్ణువు మీదికి రౌద్రంగా వచ్చాడు. విష్ణువు వాణ్ణి చూసి భయపడి పారిపోసాగాడు. మహాకాయుడు, ''ఆగు, ఆగు,'' అని భీకరంగా అరుస్తూ, విష్ణువును తరుముకు వెళ్ళాడు.

ఇద్దరూ అలా పరిగెత్తుతూ ఒక మైదానం చేరుకున్నారు. అక్కడ విష్ణువు ఎదురు తిరిగి ఆ మహాకాయుడితో యుద్ధం ప్రారంభించాడు. ఇద్దరూ బాణాలతో ఒకరినొకరు కొట్టుకున్నారు. విష్ణువు వేసే బాణాలు శివశక్తిని ఏమీ చేయలేక పోయాయి, ఎందుచేతనంటే ఆ శక్తి శరీరం మీద ఏడు కవచాలున్నాయి. కాని శివశక్తి ప్రయోగించే ప్రతి



బాణమూ విష్ణువును గాయపరిచి, రక్తధారలు ప్రవహింప చేస్తున్నది.

విష్ణువు యుక్తిపరుడు గనక, తాను ఈ విషమ పరిస్థితి నుంచి ఎట్లా బయటపడ టమా అని ఆలోచించాడు. శివశక్తి తన కన్న అంత బలంగా ఉండటానికి ఏమిటి కారణం? అది మట్టిలో నుంచి పుట్టినది. అందుకే దానిని జయించే శక్తి తనకు లేదు- శివశక్తిని జయించేవాడు కూడా మట్టినుంచే పుట్టుకు రావాలి.

ఈ విధంగా ఆలోచించి విష్ణువు, తన రక్తంతో తడిసిన మట్టి ఇంత తీసి, దానితో ఒక బొమ్మ తయారుచేసి, అందులో జీవం పోశాడు. అది విష్ణుశక్తి. అది విష్ణువు నుంచి విల్లూ, బాణాలూ తీసుకుని శివశక్తి పైన తలపడింది. రెండు శక్తులకూ మధ్య యుద్ధం ప్రారంభమయింది.

విష్ణుశక్తి ప్రయోగించే ప్రతి ఒక బాణా నికీ శివశక్తి ధరించిన కవచం ఒకటొకటిగా ఊడిపడి పోసాగింది. ఈ విధంగా ఆరు బాణాలకూ ఆరు కవచాలు ఊడి పడి పోయాయి. శివశక్తి ఒంటి మీద ఒక ఒక్క కవచం మాత్రమే మిగిలి ఉంది.

ఆ స్థితిలో శివశక్తి యుద్ధం మాని పారి పోయి, సూర్యుణ్ణి శరణుజొచ్చాడు. శరణా గతుడికి అభయం ఇవ్వటం విధాయకం



గనక సూర్యుడు వెంటనే శివశక్తికి అభయం ఇచ్చాడు.

అంతలోనే శివశక్తిని తరుముతూ విష్ణువు సూర్యుడి వద్దకు వెళ్ళి, శివశక్తిని విడిచి పుచ్చమన్నాడు.

శివశక్తి అభయం కోరింది విష్ణువు నుంచి అని తెలియగానే సూర్యుడు భయంతో వణికిపోయి, "స్వామీ, మీ సంగతి తెలియక నేను శివశక్తికి అభయం ఇచ్చాను. అతణ్ణి ఇప్పుడు విడిచి పుచ్చానంటే నాకు తీరని కళంకం శాశ్వతంగా చుట్టుకుంటుంది. అందుచేత, నా మర్యాదా మీ మర్యాదా కూడా దక్కేలాగా ఏదైనా ఒక మార్గం మీరే ఆలోచించండి," అని విష్ణువును వేడుకున్నాడు.

విష్ణువు కొంచెం ఆలోచించి, "అలాగే చేద్దాం. శివశక్తిని నీ వద్దనే ఉండనియ్యి. ముందు ముందు భారతయుద్ధం వస్తుంది. అందులో ధృతరాష్ట్రుడి కొడుకులకూ, పాండుడి కొడుకులకూ యుద్ధం జరుగుతుంది. పాండు మహారాజు భార్య కాబోయే కుంతి కన్యగా ఉండి, పరీక్షార్థమై నిన్ను ప్రార్థిస్తుంది. అప్పుడు నీవు ఆమెకు ఈ శివశక్తిని పుత్రుడుగా ప్రసాదించు," అని సూర్యుడికి చెప్పి వెళ్ళిపోయాడు.

తరవాత విష్ణువు తన శక్తిని వెంటబెట్టుకుని ఇంద్రుడి వద్దకు వెళ్ళి, "దేవేంద్రా, ఇది విష్ణుశక్తి. దీనిని నీ వద్దనే ఉంచి, ముందు ముందు కుంతి నిన్ను పుత్రభిక్ష వేడినప్పుడు ఆ శక్తిని ఆమెకు ప్రసాదించు," అని చెప్పాడు.

సూర్యుడూ, ఇంద్రుడూ కూడా విష్ణువు కోరిన ప్రకారమే చేశారు. అందుచేత కుంతికి కర్ణార్జునులు పుట్టారు. కర్ణుడు ఆ నాటి శివశక్తి. అర్జునుడు విష్ణుశక్తి. విష్ణువే ఆ కాలానికి కృష్ణుడుగా పుట్టి, భారత యుద్ధంలో అర్జునుడి చేత కర్ణుణ్ణి చంపించి, శివశక్తిని నిర్మూలింప జేశాడు.





# శిథిలాలయం

3

[శిఖాముఖి వెంట పల్లెవాసులందరూ తిరిగి శంబరపల్లె చేరారు. విక్రమకేసరి, శిఖాముఖికి తాళపత్రాలున్న ఒక సంచి చూపి, తన తాత మహేశవర్మ బ్రహ్మపుత్రానదీ లోయల కేసి వెళ్ళాడని చెప్పాడు. శిఖాముఖి, శిష్యులను సంచి తెమ్మని చెప్పేంతలో, ఒక వికృతాకారుడు వారి ముందు ప్రత్యక్షమయాడు. అందరూ నివ్వెరపోయారు. తరవాత—]

వికృతాకారుడు నిశ్శబ్దంగా అడుగులో అడుగు వేసుకుంటూ శిఖాముఖిని సమీపించి, "మీరందరూ బలవన్మరణం పాలుకాదలచకపోతే, ఆ సంచీ యిటు యివ్వండి. నేను గత వెయ్యేళ్ళుగా శిథిలాలయం పూజారిని. దాన్ని చూడదలిచి బ్రహ్మపుత్రానదీ లోయల కేసి వచ్చిన వాడెవడూ యింత వరకూ ప్రాణాలతో బయటపడలేదు," అంటూ సంచీ కోసం చేయిచాచాడు.

అంతలో శిఖాముఖి తాను మునిగిన భయసంభ్రమాల నుంచి తేరుకుని, వికృతాకారుడి కేసి తీక్షణంగా చూస్తూ, "ఇంటి కొచ్చిన అతిథిని—పిలవని పేరంటంగా వచ్చి దుర్భాషలాడే వాడైనాసరే—తన్ని తగిలేయటం శంబరులు చేయకూడని పనుల్లో ఒకటి. కనక, మర్యాదగా చెపుతున్నాను. వెంటనే బయటికి వెళ్ళిపో," అంటూ హుంకరించాడు.



"సరే, పోతున్నాను. శిథిలాలయ పూజారి శక్తిసామర్థ్యాలు నీకు తెలియవు. ఈ అవమానానికి ప్రతీకారం చేసి తీరుతాను. ఆ సంచీలో వున్న తాళపత్రాలు నీ వంశనాశనానికీ, విక్రమకేసరి వంశనాశనానికీ మాత్రమే ఉపయోగిస్తవి," అంటూ వికృతాకారుడు ద్వారం కేసి వెళ్ళి కనబడకుండా పోయాడు.

అతడు తలుపు తెరవటం గాని, మూయటం గాని ఎవరికంటాబడలేదు.

శిఖిముఖి, విక్రమకేసరి చప్పున లేచి ద్వారం దగ్గిరకు పోయి తలుపు తెరిచి బయటికి చూశారు. బయట అంతా చీకటి. వికృతాకారుడు కనిపించలేదు. ఇంటిచుట్టూ వున్న కంచెదారి దగ్గిర ఇద్దరు ముగ్గురు భటులు నిలబడి యింటికి కాపలా కాస్తున్నారు. శిఖిముఖి వాళ్ళను సమీపించి, "పిశాచంలా—అంత పొడుగున్న నల్లదుస్తులవాడు ఎటుపోయాడు?" అని ప్రశ్నించాడు.

"నల్లదుస్తులవాడా? అలాంటివా డెవడూ యిటు రాలేదే!" అంటూ కావలివాళ్ళు ఆశ్చర్యపోయారు. అంతలో ఎర్రగండు పెద్దగా మెరుగుతూ కొలను కేసి పరిగెత్తసాగింది. విక్రమకేసరి, శిఖిముఖి దాన్ని వెంబడించారు.

వాళ్ళిద్దరూ కొలనుప్రాంతం చేరేసరికి, కొలనులో దభీమంటూ ఏదో బరువైన వస్తువు పడినశబ్దం వినబడింది. కొలను చుట్టూ ఒత్తుగా పెరిగివున్న చెట్ల చాటున నీడల్లా మానవాకారాలు కదలటం కనబడింది. విక్రమకేసరి చిన్న గొంతుతో, "శిఖిముఖి! అరణ్యంలో నన్ను దొంగచాటుగా ముట్టడించిన దుర్మార్గులకు, ఆ వికృతాకారుడు నాయకుడని తెలుస్తూనే వున్నది. వాణ్ణిగాని లేక వాడి అనుచరుల్లో ఒక్కగా నొక్కణ్ణయినా గాని మనం పట్టుకోగలిగితే, వికృతాకారుడి ఎత్తుగడలేమిటో మనం తెలుసుకోవచ్చు," అన్నాడు.





"బావుంది. అలా అయితే యుద్ధరం ఒకే దిక్కుకేసి వెళ్ళటంకన్న చెరొకవైపుగా పోవటం మంచిది. వాళ్ళు సాహసికులు, ఈటె ఉపయోగించటానికి వెనుదీయరు. గాయపడినవాడు దొరికినా మన ప్రయత్నం ఫలిస్తుంది," అంటూ శిఖిముఖి కొలనుకు ఎడమవైపు వున్న చెట్ల కేసి దౌడుతీశాడు. విక్రమకేసరి కుడివైపుకు పరిగెత్తాడు.

గుబురుచెట్ల వెనక నుంచి శిఖిముఖికి దొంగల మాటలూ, వాళ్ళు నడుస్తున్నప్పుడు కాలికింద పడిన ఎండుటాకులు చేసే కర కరధ్వని వినబడింది. ఎర్రగండు చాలా దూరం నుంచి మొరుగుతున్నది. అది అందరికన్న ముందు పోతున్న దొంగవా డివెంట వెంబడిస్తున్నట్టున్నది. కుక్కను పిలిస్తే తనకెంతో సహాయంగా వుంటుంది. కాని, దొంగలకు తను వాళ్ళను వెంబడిస్తున్నట్టు తెలిసిపోతుంది. పల్లె యువకుల్ని ముందుగా హెచ్చరించి వున్నట్టయితే, వాళ్లందరి సాయంతో దొంగలను చుట్టుముట్టి పట్టుకునేవని. తనూ, విక్రమకేసరీ ఒంటరిగా బయలుదేరటం పొరబాటే అయింది. ఇప్పుడేం చేయాలి?....

శిఖిముఖి యిలా ఆలోచిస్తున్నంతలో దొంగల్లో ఒకడు కొంచెం బిగ్గరగా, "పదండి, పదండి. పూజారి దొర మూడోకన్ను తెరిచాడు!" అన్నాడు. ఆ వెంటనే నలుగురైదుగురు దొంగలు చెట్ల మాటు నుంచి గబగబా, బయటికి వచ్చి కొలనుకు అల్లంత దూరంలో వున్న మామిడితోపు కేసి పరిగెత్తసాగారు.

పూజారి దొర మూడోకన్ను తెరవటం ఏమిటి? అని ఆశ్చర్యపడుతూ శిఖిముఖి మామిడితోపు కేసి దృష్టి సారించాడు. అక్కడ ఒక మాను పక్కగా—ఆరేడడుగుల ఎత్తున ఏదో కాంతి కనురెప్పపాటులో ఆరుతూ వెలుగుతూ అతడి కంటబడింది. అది పూజారి మూడో కన్నా? అద్భుతం!







వాడు వెయ్యేళ్ళుగా శిథిలాలయానికి పూజారిగా వుంటున్నట్టు చెప్పాడు. ఆ వ్యక్తి మూడో కన్ను తెరిచి చూస్తున్నాడు. ఇదంతా మోసమా లేక వాస్తవమా?...

శిఖిముఖి యిలాంటి సంశయాలతో కొట్టుమిట్టాడుతూనే మామిడితోపు కేసి పరిగెత్తబోయేంతలో, ఎర్రగండు దెబ్బతిన్నదానిలా కుయ్యోమంటూ పెద్దగా అరిచింది. ఆ అరుపు వింటూనే శిఖిముఖి ఉగ్రుడైపోయాడు. తన కుక్కను దొంగల్లో ఎవడో గాయపరిచి వుంటాడు. వాళ్ళ నెత్తురు కళ్ళ చూడాల్సిందే. పూజారి గుండెల్లో ఈటె గుచ్చి తీరతాను. 'జై, శంకరమాతా!' అంటూ శిఖిముఖి కేక పెట్టి, మామిడితోపులో వెలుగు కనబడుతున్న వైపుకు సూటిగా పరిగెత్తాడు.

అతడు తోపును సమీపించబోతున్నంతలో అంతవరకూ మాను పక్కన కనబడుతున్న వెలుగు కాస్తా మాయమయింది. ఆ వెంటనే ఎవరో చిన్నగా మాట్లాడిన ధ్వని, నలుగు రైదుగురు నడిచి పోతున్న శబ్దమూ శిఖిముఖికి వినబడింది. అతడు ఆ శబ్దం వస్తున్న వైపుకు జాగ్రత్తగా నడవసాగాడు. చెట్ల మాటు నుంచి ఏ శత్రువైనా తన మీద కత్తి విసరవచ్చునన్న భయం అతడికి కలిగింది.

శిఖిముఖికి తనకు కొంచెం ముందుగా నడిచి పోతున్నవాళ్ళు మాట్లాడు కోవటం మరింత స్పష్టంగా వినబడింది. వాళ్ళు తనను చూసే అంత నిర్భయంగా నడుస్తున్నారా అనుకున్నాడతను. అంతలో దొంగల్లో ఒకడు కొంచెం పెద్దగానే, "అది కుక్క కాదు, పిశాచం. పూజారి దొరను చూస్తూనే కుయ్ కుయ్ అనకుండా దాని దవడలు నొక్కుకుపోయినై," అన్నాడు.

వాడు మాట్లాడుతున్నది తన ఎర్రగండును గురించి. దాన్ని యీ నీచులు చంపారా? ఆ అనుమానం కలగ్గానే శిఖిముఖి కోపంతో ఒళ్లు మరిచాడు. ఆ స్థితిలో



అతడు వెనకా ముందులు చూసుకోకుండా, "దుర్మార్గులారా, ఆగండి! ఈటె దెబ్బ కాచుకోండి!" అంటూ ముందు కురికాడు. కాని, అతడు నాలుగైదు అంగలు వేశాడో లేదో, ఎడమ కాలి కింద భూమి చప్పున కుంగిపోయింది. ముందుకు పడబోయిన వాడల్లా తమాయించుకుని, కుడి కాలి ఊతంతో, ఎడమకాలును పైకి లాగబోయేంతలో, కాలికి తాడులాంటి దేదో గట్టిగా బిగుసుకు పోయి పైకి గుంజింది. మరు క్షణం శిఖిముఖి చెట్టుకొమ్మ కొసదానికి ఒంటికాలి పట్టుతో తలకిందులుగా వేళ్ళాడ సాగాడు. అదృష్టం కొద్దీ అతడి కుడి చేతిలో వున్న యీటె గుప్పెట పట్టు నుంచి జారిపోలేదు.



తను ఎంత ఘోర ప్రమాదంలో చిక్కు కున్నదీ శిఖిముఖి అర్థం చేసుకునే లోపలే చెట్ల చాటు నుంచి అపహాస్యం చేస్తున్నట్టు పకపక మంటూ నవ్వు వినిపించింది. ఆ వెంటనే ఒక గొంతు, "పూజారి దొరా! కొదమసింగాన్ని అనుకునేవాణ్ణి, కుందేలు పిల్ల కింద ఉచ్చులో పట్టేశాం. ఇప్పుడేం చేద్దాం?" అని అడిగింది.

"తొందరపడి అప్పుడే వాడి చర్మం ఒలిచకండి. కొంచెం ఎడం ... మరీ సమీపానికొస్తే, నా మూడో కంటి వేడికి భస్మమై పోతారు," అంటూ వికృతాకారుడు చెటు చాటు నుంచి బయటికొచ్చాడు. అతడు తన మూడో కన్ను అంతలోనే మూయటం తెరవటం శిఖిముఖి చూశాడు. ఈ వికృతాకారుడా శిథిలాలయ పూజారి? అనుకున్నాడు శిఖిముఖి. తమ ఇంటిలోకి వచ్చి నవ్వాడు పిడికి నిప్పులా భగ్గుభగ్గున మండుతూ అదే మూడో కన్ను వున్నట్టు తాను గమనించలేదు. వాడు ఈటె పోటుకు అందేంత సమీపానికి వస్తే ఎంత బావుండును, అనుకుంటూ శిఖిముఖి ఈటెను బాగా చాచి, పూజారి కేసి ఊగేందుకు



31



శరీరాన్ని బలంగా కదిలించాడు. అతడి ప్రయత్నం ఏమిటో గ్రహించిన ఇద్దరు ముగ్గురు దొంగలు, తమ నాయకుణ్ణి ప్రమాదం నుంచి కాపాడేందుకు శిఖిముఖి పక్కకు వచ్చి నిలబడ్డారు.

"ఓహోహో, యీ ఆటవికుడు తన చేతి లోని పూచిక పుల్లతో నన్ను పొడవాలని చూస్తున్నట్టున్నదే!" అని పూజారి వికవిక మంటూ నవ్వి, "ఒరే, పిల్లకుంకా, నీ దర్పం యింకా అణగలేదా? తొందర పడకు," అంటూ ఒక్క క్షణం ఆగి, అంత లోనే పెద్దగా చప్పట్లు చరుస్తూ, "తల తిప్పగలిగితే చూడరా. పకీ! నీ శబర



పల్లెను నా మూడో నేత్రానికి ఆహుతి చేస్తున్నాను," అన్నాడు.

శిఖిముఖి పట్టుబలవంతాన తల పక్కకు తిప్పి పల్లె కేసి చూశాడు. పల్లెలో పెద్ద మంటలు లేస్తున్నవి. పల్లె తగలబడి పోతున్నట్టు తెలియగానే అతడు ఎక్కడలేని ఉద్రేకంతో, కాలిని బిగించి పట్టి వున్న తాడును తెంచుకునేందుకు పెనుగులాడుతూ, "దుర్మార్గుడా, నీ సేవకుల్ని పంపి, పల్లెకు నిప్పు పెట్టించావా? నీకు చావు తప్పదు. కొద్ది సేపట్లోనే మా వాళ్ళంతా యిక్కడికి వచ్చి నిన్ను చిత్రవధ చేస్తారు," అన్నాడు.

పూజారి పకపక నవ్వి, "మీ వాళ్ళంతా యిక్కడికి రాకుండా వుండేందుకే పల్లెకు అగ్గి పెట్టాను. అందరూ ఎవరి కొంపలు వాళ్ళు చల్లార్చుకునే ప్రయత్నంలో వుంటారు. అది సరేకాని, నిన్ను ప్రాణాలతో వదుల్తాను. ఆ తాళపత్ర గ్రంథాలున్న సంచి నాకు తెచ్చిస్తావా?" అన్నాడు.

"తాళపత్రాలు కాదు, నీ తల నరికి విక్రమకేసరికి ఇవ్వబోతున్నాను," అంటూ శిఖిముఖి బాగా చేయి చాచి ఈటెను పూజారి కేసి విసిరాడు. కాని, అదే సమయంలో ఒక దొంగ అడ్డు రావటంతో ఈటె



వాడి భుజంలో గుచ్చుకున్నది. వాడు ఒక చావు కేక పెట్టి విరుచుకుపడ్డాడు.

"వీడు నే ననుకున్న దానికన్నా మూఢుడు, సాహసి. కాలి కట్లు విప్పి, మొదలు తగిలించి లాక్కురండి. నేను మహా వృక్షాల మీదుగా నడిచి, అడ్డదారి వెంట అరణ్యం చేరతాను," అంటూ పూజారి పెద్దపెద్ద అంగలు వేస్తూ మాను దాటుకు వెళ్ళిపోయాడు.

పూజారి కనబడకుండా పోగానే, దొంగలందరూ ఒక చోట కూడి, గాయపడిన తమ అనుచరుల గాయాలకు కట్లు కట్టారు. గాయపడిన వాళ్ళల్లో ఒకడు మూలుగుతూ, "ఒరే, అబ్బిగాళ్ళూ, ఇక మన దారిన మనం పోదాం. ఈ పూజారిని నమ్మి మన ప్రాణాల మీదికి తెచ్చుకోవటం ఎందుకు?" అన్నాడు.

"నోరు ముయ్యరా పిరికి సన్నాసి. పూజారి దొర మన కిచ్చిన బంగారం మాటేమిటి? ఆ దొరకు మనం చేసిన ప్రమాణం సంగతేమిటి? మన మేమన్నా నీతి జాతి లేనివాళ్ళమా?" అంటూ కసిరాడు ఒక దొంగ.

"అసలు పాట్లన్నీ యీ అడవి దున్న గాడు యిక్కడికి రావటంతో మొదలయినై. వీడ్ని వెంట పెట్టుకుపోయే శ్రమ మన కెందుకు? పారిపోవాలని చూస్తే చంపామని చెప్పొచ్చు. కత్తితో గుండెల్లో ఒక్క పోటు పొడుస్తాను," అంటూ దొంగల్లో ఒకడు మీసం మెలివేస్తూ లేచి కత్తి ఎత్తి శిఖిముఖిని పొడవబోయాడు. కాని, శిఖిముఖి తన యీటెతో దాన్ని పక్కకు నెట్టి, అదే సమయంలో దొంగను యీటెతో గట్టిగా పొడిచాడు. ఆ పోటు దొంగ వీపుకు తగిలింది. వాడు బాధతో అరిచాడు. మిగతా దొంగలు కోపంతో ఒళ్ళు మరిచి, "చంపండి!" అంటూ ఒక్కసారిగా శిఖిముఖి మీద కత్తులు ఎత్తారు. —(ఇంకా వుంది)



# మిత్రద్రోహం

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ఇలా శ్రమపడతానని ఎవరికైనా మాట ఇచ్చి ఉన్న పక్షంలో ఆ మాట నిలబెట్టుకోవటం ప్రశంసనీయమే. స్వర్ణపురి మంత్రి కొడుకైన కృతవర్మ లాగా మిత్రద్రోహం చెయ్యటం ఎంత మాత్రమూ కూడదు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు కృతవర్మ కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు.

పూర్వం స్వర్ణపురిని కులవర్ధి అనే రాజు పాలించేవాడు. ఆయనకు కుంతలవర్ధి అనే మంత్రి ఉండేవాడు. ఆ మంత్రి సహాయంతో రాజు తన నగరాన్ని చాలా సమర్థతతో పరిపాలించేవాడు.

## బేతాళ కథలు



రాజు కొడుకు సుదర్శనుడూ, మంత్రి కొడుకు కృతవర్మా అబాల్యమిత్రులు. ఒకే ఈడు వాళ్ళు. పదహారో ఏడు వచ్చేదాకా ఇద్దరూ ఒకే గురువు వద్ద చదువుకుని, విద్యాభ్యాసం పూర్తి చేశారు.

చదువు పూర్తి కాగానే, రాజు కొడుకైన సుదర్శనుడికి దేశాటన చెయ్యాలన్న కోరిక తీవ్రంగా కలిగింది. అతను తండ్రితో ఆ మాట చెబితే, రాజు అందుకు అసమ్మతి తెలపటమే కాక, అతను దేశపు పొలిమేరలు దాటకుండా గట్టి బందోబస్తు చేశాడు.

రాజు తన కొడుకును రాజ్యం దాటి పోకుండా నిర్బంధించ టానికి కారణం ఉన్నది. సుదర్శనుడు పసివాడై ఉండగానే ఒక గొప్ప జ్యోతిష్కుడు అతని జాతకం చూసి, ఆ కుర్రవాడికి 17 ఏళ్ళు నిండే సమయంలో ఒక గండం ఉన్నదని, రాజుగా పట్టాభిషిక్తు డయ్యేదాకా అతను రాజ్యం విడిచి పోరాదని, అలా పోయిన పక్షంలో అతనికి స్వర్ణపురి సింహాసనం దక్కదని చెప్పి ఉన్నాడు.

ఈ సంగతిని రాజు తన మనస్సులోనే రహస్యంగా దాచుకున్నాడు, చివరకు మంత్రితోనైనా చెప్పలేదు.

తండ్రి ఉత్తరువుకు కారణం తెలియక సుదర్శనుడు చాలా ఆశాభంగం చెందాడు: తాను తప్ప రాజ్యంలో ప్రతి ఒకడూ రాజ్యం దాటి వెళ్ళవచ్చు, కాని తాను మాత్రం వెళ్ళరాదు. ఇది రాజకుమారుడికి దుర్భర మనిపించింది. అతను ఈ విషయం తన మిత్రుడైన కృతవర్మతో దీర్ఘంగా ఆలోచించిన మీదట, ఇద్దరూ ఒక నిర్ణయానికి వచ్చారు. అదేమిటంటే రహస్యంగా పర కాయప్రవేశ విద్య నేర్చుకోవటం.

వాళ్ళు ఒక సిద్ధుణ్ణి పట్టుకుని ఆ విద్యను స్వాధీనం చేసుకున్నారు.

"ఇప్పుడు నా శరీరంలో నువ్వు ప్రవేశించు. నీ శరీరంలో నేను ప్రవేశించి, నీ రూపంలో

దేశాటన చేసి వస్తాను. నీ రూపంలో ఉన్న నన్ను ఎవరూ ఆపరు," అన్నాడు సుదర్శనుడు.

కృతవర్మ మొదట ఈ ఏర్పాటు గురించి భయపడ్డాడు.

"మనిద్దరమూ రాజాజ్ఞను ఉల్లంఘిస్తున్నాం. ఇది నేరమే. అయినా నీ కోసం అంగీకరిస్తున్నాను. ఏ పరిస్థితులలోనూ నువ్వు ఆరునెలల లోపుగా తిరిగి వచ్చి, నా శరీరాన్ని నాకిచ్చి, నీ శరీరాన్ని నువ్వు తీసుకోవాలి. అలా చేస్తానని ప్రమాణం చెయ్యి," అన్నాడు కృతవర్మ సుదర్శనుడితో.

సుదర్శనుడు ప్రమాణం చేశాడు. ఇద్దరూ శరీరాలు మార్చుకున్నారు. సుదర్శనుడు కృతవర్మ శరీరంతో వేటకు వెళ్ళే నెపం మీద బయలుదేరి దేశాటన చెయ్య బోయాడు. అతన్ని ఎవరూ ఆపలేదు. కృతవర్మ రాజకుమారుడి శరీరంతో అంతఃపురానికి వెళ్ళి, అక్కడ తానే రాజకుమారుడైనట్టు మసులుకున్నాడు.

కొంతకాలం గడిచింది. వేటకు వెళ్ళిన తన కొడుకు తిరిగి రానందుకు మంత్రి చాలా దిగులు పడ్డాడు. భటుల చేత ఎంత వెతికించినా అరణ్యంలో అతని కళేబరమైనా దొరకలేదు.



ఇంతలో ఒకనాడు హఠాత్తుగా రాజు చనిపోయాడు. రాజకుమారుడి రూపంలో ఉంటున్న కృతవర్మకు పట్టాభిషేకం జరిగింది. రాజ్యభారమంతా మంత్రే చూస్తున్నాడు. కాని కొడుకు కోసం ఆయన లోలోపల పడే సంక్షోభం మనోవ్యాధిగా పరిణమించి ఆయనను కుంగదీస్తున్నది.

తన తండ్రి తనకోసం మనోవ్యాధితో క్షీణిస్తూంటే కృతవర్మ ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయాడు. "నేనే కృతవర్మను" అని తండ్రికి నిజం చెప్పేద్దామని అతనికి అనేక పర్యాయాలు నోటిదాకా వచ్చింది. కాని అతను మంత్రితో అలా



నిజం చెప్పేస్తే చాలా ప్రమాదం ఉన్నది. మంత్రి తనను ఒక్క క్షణం కూడా రాజుగా ఉండనివ్వడు. ధర్మం ఏ మాత్రం భంగమైనా ఆయన సహించడు. సింహాసనం మీద ఎవరూ లేకుండా పోతే దేశానికి ఇరుగు పొరుగు దేశాల రాజుల వల్ల ప్రమాదం ఉంటుంది.

అందుచేత కృతవర్మ తాను రాజులా తండ్రి దగ్గిర అభినయిస్తూ, కృతవర్మక్కూడా దేశసంచారం చెయ్యాలని తీవ్రమైన కోరిక ఉండేదనీ, అతను అందుకే వెళ్ళాడనీ, త్వరలోనే తిరిగి వస్తాడని ధైర్యం చెబుతూ వచ్చాడు.

నిజానికి కృతవర్మ కూడా రాజకుమారుడి రాకకోసం ఎంతో ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు. అతనికి ముళ్ళమీద ఉన్నట్టే ఉన్నది. ఆరునెలలు గడిచాయి. రాజకుమారుడు తిరిగి రాలేదు.

మంత్రి క్రమంగా మంచం పట్టాడు. ఆయన తనకు మరణకాలం సమీపించినప్పుడు రాజుగా ఉన్న కృతవర్మను పిలిచి, "నాయనా, నాకు నా కొడుకు ఒకటి, నువ్వు ఒకటీ కాదు. నా కొడుకు కనబడకుండా పోయినప్పటి నుంచీ నిన్నే నా కొడుకుగా చూసుకుంటున్నాను. ఇంత కాలమూ నేనే రాజ్యభారం మోశాను. ఇక నుంచీ ఆ భారం నీమీద పడుతుంది. పోయిన రాజుగారూ, నేనూ కూడా ధర్మపాలన గురించి ఎంతో శ్రద్ధవహించాం. నువ్వు కూడా మీ తండ్రిలాగానే ఏ పరిస్థితిలో కూడా ధర్మాన్ని నిలబెట్టి రాజ్యం చేస్తానని నాకు మాట ఇస్తేనే గాని, నేను నిశ్చింతగా కన్ను మూయలేను," అన్నాడు.

మంత్రి కోరిన ప్రకారమే కృతవర్మ ప్రమాణం చేశాడు. మంత్రి ప్రాణాలు వదిలాడు.

కృతవర్మ తండ్రికి చేసిన ప్రమాణాన్ని అక్షరాలా నిలబెట్టుకున్నాడు. అతని



పాలనలో ప్రజలు పాతరాజునూ, పాత మంత్రినీ తేలికగా మరిచిపోయారు.

రాజకుమారుడు తిరిగి రానేలేదు.

ఒక సంవత్సరం గడిచింది.

ఒకనాడు కృతవర్మ వేటకు బయలుదేరి వెళ్ళాడు. అరణ్యంలో ఒక చిలుక ఎగిరి వచ్చి అతని భుజం మీద వాలింది. దాని వింత ప్రవర్తనకు అతను ఆశ్చర్యపోతూ, దాని కేసి చూసేంతలో ఆ పక్షి ఇలా చెప్పసాగింది:

"నన్ను గుర్తించలేదా, మిత్రమా? నేను సుదర్శనుణ్ణి. నా చరిత్ర నీకు చెప్పటానికి ఇవాళ అవకాశం దొరికింది. నేను ఆరునెలల లోపల తిరిగి వస్తానని నీకు మాట ఇచ్చాను. కాని నాకు ప్రపంచం చూస్తున్న కొద్దీ ఇంకా చూడాలనిపించింది. మన రాజ్యానికి తిరిగి రాబుద్ధిపుట్టలేదు. మన రాజ్యంలో నిజానికేమున్నది? ప్రపంచంలో ఎన్నో వింతలు చూశాను. ఇంతలో నాకొక ప్రమాదం సంభవించింది. ఒక అరణ్యంలో ఒక నరభక్షకుడైన రాక్షసుడు నన్ను పట్టుకుని తన గుహకు తీసుకుపోయాడు. నన్ను వాడు చంపి తింటాడని తెలుసు. ఆ సమయానికి నాకీ చిలక శరీరం దొరికింది. అందులో ప్రవేశించాను. ఇప్పుడు నాకు ప్రపంచం చూడటానికి మరింత



మంచి అవకాశం దొరికింది. నే నిక్కడికి రాకనేపోదును, నీ శరీరం నాశనమై పోయిం దని తెలపటానికీ, జరిగిన పొరబాటుకు నీకు క్షమాపణ చెప్పుకోవటానికి వచ్చాను. ఇక నాకు సెలవియ్యి."

ఈ మాటలు అని చిలుక కాస్త చెట్లల్లోకి ఎగిరిపోయింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, కృతవర్మ తన మిత్రుడి శరీరం అతనికి ఇచ్చేసి, తాను మరొక శరీరం ఎందుకు చూసుకో లేదు. అలా చెయ్యకపోవటం మిత్రద్రోహం కాదా? కృతవర్మ మిత్రద్రోహం చెయ్య టానికేమిటి కారణం? రాజ్యకాంక్షా? తన శరీరాన్ని తన మిత్రుడు రాక్షసుడివాత పెట్టాడని కోపమా? ఈ ప్రశ్నలకు సమా ధానం తెలిసికూడా చెప్పకపోతే నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కృతవర్మకు మిత్రద్రోహం అంటగట్టటానికి ఒక్క కారణం కూడా కనబడదు. ఏ విధంగా చూసినా సుదర్శనుడు రాజ్యాధికారానికి అర్హుడు కాడు. ఆ సంగతి ముందు జ్యోతిష్కుడు చెప్పాడన్నది అలా ఉంచి, అతనికి దేశాటన చెయ్యాలన్న ఆసక్తిలో సహస్రాంశమైనా రాజ్యపాలన చెయ్యటంలో లేదు. కృతవర్మ నిజంగా రాజ్యకాంక్షగలవాడైతే తన స్నేహితుడి రాకకోసం అంతగా ఎదురు చూడడు. అదీ గాక అతను తన తండ్రి దగ్గిర ప్రమాణం చేసి, ఆ ప్రమాణాన్ని నిల బెట్టుకున్నాడు. తాను తన తండ్రికి చేసిన ప్రమాణాన్ని తన స్నేహితుడికి మార్చటం పొసగదు. అందు చేత కృతవర్మ రాజ కుమారుడి శరీరాన్ని రాజకుమారుడికి తిరిగి ఇవ్వక పోవటంలో దోషం ఏమీ లేదు," అన్నాడు.

రాజు కీవిధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# పతివ్రత

ఒక గ్రామంలో రైతు దంపతులు ఉండే వారు. వారికి ఒక ఇల్లూ, కొంత పొలమూ ఉండేవి. పొలం మీద వచ్చే గింజలతో వారికి ఏ కష్టాలూ లేకుండా జీవితం సుఖంగానే గడిచిపోతున్నది.

రైతు కున్న చిక్కల్లా ఏమిటంటే, అతని భార్యకు అమితమైన మతిమరుపు. ఏ క్షణం చెప్పిన మాట మరుక్షణం మరిచి పోయేది. అందువల్ల రైతుకు చాలా ఇబ్బందిగా ఉండేది; అయినా అతను భార్యను ఏమీ అనలేక, సహించి ఊరు కుంటూవచ్చాడు.

ఒక రోజు రైతు పొలం పనులు ప్రారంభించటానికి బయలుదేరి పోతూ, తన భార్యతో, ఝాము పొద్దెక్కే సరికి అన్నం కట్టుకుని పొలానికి రమ్మని చెప్పి, కూలీ లను వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు. భార్య సరేనని తల ఆడించింది.

కొంచెం సేపయాక పొరుగింటి మనిషి వచ్చి, రైతు భార్యతో ఏవేవో కబుర్లు పెట్టుకున్నది. ఆ కబుర్లతో రైతు భార్య తన భర్త భోజనం మాట మరిచిపోయింది. ఝాము పొద్దు ఎక్కనే ఎక్కింది. ఇంకా కబుర్లు పూర్తి కాలేదు.

పొరుగింటి మనిషి వెళ్ళిపోయాక రైతు భార్యకు తన భర్త చెప్పిన మాట గుర్తు కొచ్చింది. అప్పుడామె గబగబా వంట పని ప్రారంభించింది.

పొలం దగ్గర ఉన్న రైతు తన భార్య కోసం ఎదురుచూసి, ఎదురుచూసి, తానే ఇంటికి వచ్చేశాడు. అప్పుడే భార్య పొయ్యి లోకి కట్టెలు తెస్తున్నది. రైతు మండిపడి, కట్టెపేడుతో భార్యను నాలుగు బాది, తానే వంట చేసుకుని తిని, తిరిగి పొలానికి వెళ్ళి పోయాడు. రైతు భార్య ఏడుస్తూ మంచంలో పడుకుంది.

పి. సత్యంరాజు



మర్నాడు ఉదయం రైతు మళ్ళీ పొలానికి బయలుదేరుతూ, కిందటి రోజు చెప్పినట్టే, మధ్యాహ్నం పొద్దెక్కేసరికల్లా పొలానికి అన్నం కట్టుకురమ్మనీ, లేకపోతే చీరేస్తాననీ హెచ్చరించి వెళ్ళిపోయాడు.

కాని అదే వేళకు పొరుగింటి మనిషి మళ్ళీ వచ్చి కబుర్లు ప్రారంభించింది. ఆవిడ వెళ్ళిపోయేసరికి మధ్యాహ్నం పొద్దెక్కింది. అప్పుడుగాని రైతుభార్యకు మొగుడి మాట జ్ఞాపకం రాలేదు. ఇంకాస్సేపట్లో మొగుడు ఇంటికి వచ్చి తన ఒళ్ళు హూనం చేసేస్తాడు. ఈ లోపల తాను వంట చెయ్యటం సాధ్యమయే పని కాదు.

రైతుభార్యకు ఒక ఉపాయం తట్టింది. ఆమె ఒక గిన్నెలో ఇన్ని బియ్యమూ, మరొక చిన్న గిన్నెలో తరిగిన కూర ముక్కలూ ఉంచి, రెండు గిన్నెలూ ఒక దాని మీద ఒకటి పెట్టి మూటకట్టి నెత్తిన పెట్టుకుని, పొలానికి బయలుదేరింది.

భార్య ఎంతకూ రాకపోవటం చూసి, ఇంటికి బయలుదేరుదామనుకుంటున్న రైతు, భార్యను అంతదూరాన చూసి, ఎదురు వెళ్ళి, "ఎందుకింత ఆలస్యం చేశావు? నీ మతిమరుపు మండా!" అంటూ ఆమెను ఈ దవడా ఆ దవడా వాయించాడు.

రైతుభార్య తన నెత్తి మీది మూట కింద పెట్టి, సూర్యుడి కేసి తిరిగి దణ్ణం పెట్టి, "ఓ సూర్యభగవానుడా, నా మొగుడు పెట్టే బాధలు పడలేకుండా వున్నాను. నేనే గనక పతివ్రతనైతే, అన్నమంతా బియ్యంగానూ, వండిన కూరంతా పచ్చిముక్కలు గానూ అయిపోవుగాక!" అన్నది.

రైతు మూట విప్పి చూస్తే పచ్చి బియ్యమూ, తరిగిన వంకాయ ముక్కలూ మాత్రమే ఉన్నాయి. రైతు తన భార్య అమాయకపు ఎత్తుకు విరగబడి నవ్వి, ఆమెను శిక్షించి ప్రయోజనం లేదని తెలుసుకున్నాడు.





# దౌర్జన్యం

కాంపిల్య నగరం వెలపలగా, అరణ్యానికి సమీపంలో ఒక ముసలమ్మ గుడిసె వేసుకుని ఉంటూ ఉండేది. ఆ ముసలమ్మకు నా అన్న వారెవరూ లేరు. తన శరీర కష్టం తప్ప ఆమెకు మరో జీవనాధారం ఏమీ లేదు. కష్టపడి పనిచేసే వయసు కూడా దాటిపోయి, ఆమె తాను కూడబెట్టిన కొద్ది డబ్బుతోనూ ఎలాగో జీవిస్తుంటే, ఒకనాడు ఆమె వద్దకు కొందరు దొంగలు వచ్చి, ఆమె చేతికి పుష్కలంగా డబ్బిచ్చి, తమకు వంట చేసి పెట్టమన్నారు.

అది మొదలు దొంగలు రాత్రి పొద్దుపోయి రావటమూ, ముసలమ్మ పెట్టిన తిండి తినటమూ, అరణ్యంలోకి వెళ్లిపోవడమూ జరుగుతూ వచ్చింది. అదే సమయంలో నగరంలో దొంగతనాలు ఎక్కువైనట్టు కూడా ముసలమ్మ విన్నది. అయినా ముసలమ్మ మాటాడక ఊరుకున్నది. ఎందుచేతంటే, దొంగల ధర్మమా అంటూ ఆ ముసలిదానికి అట్టే శ్రమ లేకుండా హాయిగా గడిచిపోతున్నది. వాళ్ళు తమ భోజనం ఖర్చు కింద ఇచ్చే డబ్బులో ముసలమ్మకు చాలా మిగులుతున్నది. అదిగాక మూలనున్న ఈ ముసలమ్మను దొంగల ఆచూకీ అడిగినవారు కూడా లేరు.

కాంపిల్య రాజైన సత్యవర్మ అసాధారణ పరాక్రమవంతుడు. ఆయనకు ముగ్గురు భార్యలున్నప్పటికీ సంతానం ఒక్క ఆడపిల్ల మాత్రమే. ఆమె పేరు కనకసుందరి. ముగ్గురు తల్లుల తీపిగా అతి గారాబంగా పెరిగిన ఆ పిల్ల భూలోక రంభ లాగా తయారయింది.

సత్యవర్మ తన కుమార్తెకు పెళ్ళి చేసే ఆలోచనలో ఉన్నాడని తెలిసి, ఎక్కడెక్కడి రాజకుమారులూ, రాజులూ ఆమెను వివాహమాడ కోరారు. కాని రాజకుమార్తె వారి

ఎం. సత్యనారాయణ



నందరినీ తిరస్కరించింది. అలా తిరస్క-
రించబడిన వారిలో సువీరదేశపు రాజైన
చండవర్మ ఒకడు. మిగిలినవారి లాగా
అతను రాజకుమార్తె తిరస్కారాన్ని అమో-
దించక, ఆమెనే పెళ్ళాడతానని ఘోరమైన
శపథాలు చేశాడు. తనకు సైనికబలమే
ఉన్నట్టయితే చండవర్మ కాంపిల్య నగరం
మీదికి దండెత్తి వచ్చి ఉండేవాడే. కాని
అది కలలో కూడా సాధ్యం కాదు.
సత్యవర్మ ఒక్క ఘడియ కాలంలో చండ
వర్మనూ, అతని బలాలనూ మట్టుబెట్ట
గలడు. అందుచేత చండవర్మ ఇతర
మార్గాలు ఆలోచించవలసి వచ్చింది.

కనకసుందరిని ప్రేమించిన యువకుడు
మరొకడు కూడా ఉన్నాడు. అతను కటక
దేశపు యువరాజు మహీధరుడు. అతను
అజ్ఞాతంగా దేశాలు తిరుగుతూ కాంపిల్య
నగరం వచ్చి, ఉద్యానవనంలో రాజ
కుమార్తెను చూసి, ఆమె అద్భుత సౌంద
ర్యానికి విశ్చేష్టుడై పోయాడు. ఆ సమయం
లోనే రాజకుమార్తె కూడా అతన్ని చూసి,
తనను వరించ వచ్చిన వారందరి కన్న
ఈ యువకుడు ఎంతో అందంగా ఉన్నా
డనుకున్నది.

రాజకుమార్తె తన చెలికత్తెలతో వెళ్ళి
పోయాక మహీధరుడు ఆమెను గురించే
ఆలోచిస్తూ, పరధ్యానంలో ముసలమ్మ
గుడిసె ఉండే ప్రాంతానికి వచ్చాడు.
అతను, దాహం కావటం చేత, ఆ గుడిసెలో
ప్రవేశించి, ముసలమ్మను మంచినీ ళివ్వమని
అడిగాడు. ముసలమ్మ అప్పుడే దొంగల
కోసం వంట ప్రారంభించింది.

ఆమె ఇచ్చిన మంచినీరు తాగి మహీ
ధరుడు, "ఈ గుడిసెలో నీతోబాటు ఇంకా
చాలామంది ఉన్నారా, అవ్వా? పెద్ద వంట
చేస్తున్నట్టున్నావు?" అన్నాడు.

"నా కెవరున్నారు, నాయనా? ఈ
వంటంతా ముఠావాళ్ళ కోసం. నెలరోజులుగా



వాళ్ళు రాత్రిళ్ళు నా చేత వంట చేయించుకు తింటున్నారు. ఇవాళతో వదిలిపోతారులే. ఇవాళ రాత్రితో వాళ్ళు వచ్చిన పని అయిపోతుందట," అన్నది ముసలమ్మ.

"ఎవరా ముఠావాళ్ళు? వాళ్ళది ఏ దేశం? వాళ్ళు ఉండేది ఎక్కడ?" అని మహీధరుడు అడిగాడు.

"నాతో వాళ్ళు ఆ సంగతులేవీ చెప్పలేదు, నాయనా. వాళ్ళు కనిపించినది మొదలు దొంగతనాలు నగరంలో జాస్తి అయినాయని చెప్పుకుంటున్నారు. అదంతా వీళ్ళ పనేనేమో?" అన్నది ముసలమ్మ.

ఈ ముఠా సంగతి అంతు తెల్సుకోవాలని మహీధరుడికి తోచింది. అతను ముసలమ్మతో, "ఈ రాత్రి నన్ను కూడా నీ గుడిసెలో ఉండనిస్తావా, అవ్వా?" అన్నాడు.

"అమ్మో. దొంగలకు తెలిస్తే నిన్నూ, నన్నూ కూడా చంపేస్తారు. వాళ్ళు వచ్చేసరికి చాలా రాత్రి అవుతుంది. ఈ లోపుగా వంట పూర్తి చేసి నీ కింత అన్నం పెట్టగలను. కాని వాళ్ళు వచ్చేసరికి నువ్విక్కడ ఉండరాదు," అన్నది ముసలమ్మ.

మహీధరుడు ఆమె పెట్టిన భోజనం తిని, "వస్తాను, అవ్వా. మళ్ళీ కనిపిస్తానులే!" అని ఆమె వద్ద సెలవు తీసుకున్నాడు.

అయితే అతను అట్టే దూరం వెళ్ళలేదు. ముసలమ్మ ఉండే గుడిసె ముందున్న చెట్లలో ఒక ఎత్తయిన చెట్టెక్కి, కొమ్మల మధ్య కనపడకుండా కూర్చున్నాడు.

అర్ధరాత్రి దాటినాక పదిమంది గుర్రాల మీద గుడిసె దగ్గిరికి వచ్చారు. వారు కొల్లగొట్టిన ధనం ఏమీ వారి వెంట ఉన్నట్టు లేదు. ఒక గుర్రం మీద పెద్ద మూట మాత్రం ఉన్నది. మరొక గుర్రం మీద ఒక బాన ఉన్నది.

దొంగలు ముసలమ్మ గుడిసెలోకి ప్రవేశించేటప్పుడు బానను పట్టుకుపోయారు గాని, మూటను గుర్రం మీదే వదిలేశారు. త్వర



లోనే గుడిసెలో నుంచి దొంగల నవ్వులూ, కేరింతలూ వినిపించాయి. వాళ్ళు తమ పని పూర్తిచేసిన ఆనందంలో తెగ తాగేస్తున్నా రన్నది స్పష్టమయింది.

మహీధరుడు చెట్టు దిగివచ్చి, గుర్రం మీది మూటను సమీపించి, తాకి చూశాడు. ఆ మూటలో ఎవరో మనిషి ఉన్నట్టు తెలిసి అతనికి అంతులేని ఆశ్చర్యమయింది. అతను గబగబా మూట విప్పి, లోపల దృఢంగా బంధించబడి ఉన్న స్త్రీని చూశాడు. ఆమె రాజకుమార్తె కనకసుందరి! అత నామె కట్లు గబగబా విప్పేసి, "దొంగలు వెళ్ళి పోయినదాకా, మర్రి పొదల చాటున దాగి ఉండి, తరవాత గుడిసెలోకి వెళ్ళు. అవ్వ చాలా మంచిది. తెల్లవారే లోపుగా నేను తిరిగివచ్చి, నిన్ను మీ భవనం చేరుస్తాను," అన్నాడు.

రాజకుమార్తె మంచి నిగ్రహం కలది. ఆమె అరవలేదు, మాట్లాడలేదు, అతను చెప్పినట్టే పొదల చాటుకు వెళ్ళిపోయింది. ఈలోపుగా మహీధరుడు గుర్రం మీద తనను తాను మూటగా చేసుకుని, కదల కుండా ఉన్నాడు.

చాలా సేపటికి దొంగలు తూలుతూ గుడిసె నుంచి బయటికి వచ్చి, తమ గుర్రాల నెక్కి, అరణ్య మార్గంగా చాలా దూరం వెళ్ళి, అక్కడ ఒక ఇంటిని చేరుకున్నారు. అక్కడ వాళ్ళు మూటను ఒక మూల జాగ్రత్తగా పెట్టి, పడుకుని, వెంటనే గురకలు పెట్టి నిద్రపోసాగారు.

అందరూ నిద్రలో ఉన్నారని తెలియ గానే మహీధరుడు తన మూట నుంచి బయటికి వచ్చి, ఒక్కొక్క దొంగనూ చేతులూ, కాళ్ళూ కట్టి, ఒక్కొక్కణ్ణీ ఒక్కొక్క గుర్రం మీద అడ్డంగా పడేసి, తాను ఒక గుర్రమెక్కి, దొంగలందరినీ తిన్నగా రాజభవనానికి చేర్చాడు. అప్పటికే తెల్లవారింది. అంతకుముందే రాజకుమార్తె

పోయిన వార్త రాజభవనం అంతటా పాకి, అల్లకల్లోలంగా ఉన్నది.

"వీళ్ళే రాజకుమార్తెను ఎత్తుకుపోయిన దొంగలు. రాజకుమార్తె ఒకచోట క్షేమంగా ఉన్నది. ఇప్పుడే ఆమెను తెస్తాను," అంటూ మహీధరుడు గుర్రం మీద ముసలమ్మ గుడిసెకు వచ్చాడు. అతని కోసం ఎదురు చూస్తూ, ముసలమ్మా, రాజకుమార్తే కూడా మేలుకునే ఉన్నారు.

సత్యవర్మ తన కుమార్తెను రక్షించిన మహీధరుడికి మొదట తన కృతజ్ఞత తెలుపుకున్నాడు. కాని అతను ప్రచ్ఛన్నంగా తిరుగుతున్న కటకదేశపు యువరాజని తెలిసినాక, అతను తన అల్లుడైతే బాగానే ఉండునని ఎంచింది. ఆయన తన కుమార్తెకేసి చూసి, ఆమెకు కూడా మహీధరుడి మీద అనురాగం ఉన్నట్టు గ్రహించాడు.

దొంగల విచారణ జరిగింది. వారు కేవలమూ దొంగలు మాత్రమే కారని, చండవర్మచేత కనకసుందరిని ఎత్తుకు రావటానికి పంపబడిన చారులని, వాళ్ళు దొంగతనాలు చేసినది మామూలు దొంగలన్న భ్రమ కలిగించి, చండవర్మ పైన అనుమానం తగలకుండా ఉండగలందులకని బయటపడింది. దొంగలకు మరణదండన విధించబడింది.

సత్యవర్మ నిండు సభలో మహీధరుడికి సన్మానం చేసి, అతనికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేస్తానని ప్రకటించాడు. తనతో పాటు సన్మానం పొందదగిన ముసలమ్మ ఒకతె ఉన్నదని మహీధరుడు చెప్పటంచేత ఆమెకు కూడా గొప్ప బహుమానం ఇవ్వబడింది.

ఆ రోజే సత్యవర్మ తన సైన్యాన్ని సువీర దేశం పైకి తరలించుకు పోయి, చండవర్మను యుద్ధంలో ఓడించి పట్టుకుని, బహిరంగంగా అతనికి శిరశ్ఛేదం చేయించాడు.

తరవాత మహీధరుడికి, కనకసుందరికి వైభవంగా వివాహం జరిగింది.





# పేరుమార్పు

ఒక ఊళ్ళో ఒక పేదరాలి కొక కొడుకుండే వాడు. వాడి పేరు సోమన్న. సోమన్న తండ్రి దారిద్ర్యానికి తట్టుకోలేక, సంసార భారం నుంచి విముక్తి పొందటానికి, సోమన్న పసివాడుగా ఉన్నప్పుడే దేశాలు పట్టి పోయాడు. సోమన్నను తల్లే అతికష్టం మీద పెంచి పెద్దవాణ్ణి చేసింది. తల్లికొడుకు లిద్దరూ ఎంత శ్రమపడినా వారికి పొట్ట గడవటం అసాధ్యమై పోయింది. దీనికి తోడు సోమన్నకు పెళ్ళి చేసుకోవాలని కోరిక కలిగింది. కాని వాడు పేదవాడైనందువల్ల, చుట్టు పక్కల వాళ్ళెవరూ పిల్ల నివ్వారు కారు. అందరూ వాణ్ణి అసమర్థుడి కింద కట్టేశారు. ఆ పరిస్థితిలో సోమన్న ఒకనాడు తల్లికి చెప్పకుండా రహస్యంగా ఇంటి నుంచి బయలుదేరాడు.

సోమన్న వెళ్ళి వెళ్ళి ఒక నగరం చేరాడు. అక్కడ వాడు తన దగ్గర ఉన్న కొద్ది డబ్బులతో రెండు లడ్డూలు కొని, నగరం వెలుపల పెద్ద చెరువుగట్టుకు చేరాడు. అక్కడికి రాజుగారి చాకలివాళ్ళు బట్టల మూటలతో వచ్చి చేరారు. సోమన్న వాళ్ళు చూస్తూండగా తన లడ్డూలు పైకి తీసి తింటూ, "మీరు కూడా లడ్డూలు తెచ్చుకున్నారా?" అని చాకలివాళ్ళను అడిగాడు.

"ఎక్కడి నుంచి?" అని చాకళ్ళు అడిగారు.

"మీకు తెలీదా? ఈ పక్క గ్రామంలో జమీందారుగారికి అబ్బాయి పుట్టాడట. అందరికీ లడ్డూలు పంచుతున్నారు," అన్నాడు సోమన్న.

"అయితే మేం కూడా వెళ్ళి లడ్డూలు తెచ్చుకుంటాం. కాస్త మా మూటలు చూస్తూంటావా, బాబూ?" అని చాకళ్ళు సోమన్న నడిగారు.

కె. నాగరాజరావు

"అలాగే చూస్తూంటాను. త్వరగా రండి. నాకు వేరే చాలా పనులున్నాయి," అన్నాడు సోమన్న.

"నీ పేరేమిటి, బాబూ?" అని వాళ్ళు మళ్ళీ అడిగారు.

"సుడిగాలి," అన్నాడు సోమన్న.

చాకళ్ళు వెళ్ళిపోయారు. వాళ్ళు కను చాటు కాగానే సోమన్న వాళ్ళ బట్టల మూటలు తీసుకుని తానూ ప్రయాణం సాగించాడు.

చాకళ్ళు తెగ తిరిగి, లడ్డూలిచ్చే జమీందారును కానక, సుడిగాలి తమను మోసగించాడని తెలుసుకుని, తిరిగి వచ్చి తమ బట్టల మూటలు పోయాయని గ్రహించి, పరుగు పరుగున రాజుగారి దగ్గిరికి వెళ్ళి, చాకిబట్ట లన్నింటినీ సుడిగాలి ఎత్తుకు పోయినట్టు ఫిర్యాదు చేశారు.

"బట్టలను సుడిగాలి ఎత్తుకుపోతే మీరు మాత్రం ఏం చెయ్యగలరు? మిమ్మల్ని శిక్షించను. ఇకనుంచి జాగ్రత్తగా వుండండి, వెళ్ళండి," అన్నాడు రాజు.

ఈ లోపుగా సోమన్న చాలా దూరం వెళ్ళి, బట్టల మూటల నుంచి రాజోచితమైన దుస్తులు తీసి ధరించి, మిగిలినవి వదిలేసి, ముందుకు సాగాడు.



దారిలో వాడి కొక మనిషి కొన్ని గుర్రాలను తోలుకుపోతూ కనిపించాడు. సోమన్న వాడితో మాట్లాడి, వాడు గుర్రాల బేరగాడని తెలిసి, వాడి గుర్రాలలో మంచిదాన్ని ఎంచి, "దీనికి ఎంత అడుగుతావు?" అన్నాడు.

"మంచి గుర్రం. అయిదువందల కైతే ఇస్తాను," అన్నాడు గుర్రాల బేరగాడు.

"అంతా చేసేటట్టే కనిపిస్తుంది. అయినా ఎక్కి చూసిగాని డబ్బివ్వను. సరేనా," అన్నాడు సోమన్న.

"నీ పేరేమిటి?" అన్నాడు బేరగాడు.

"నా పేరు అప్పులవాడు," అని చెప్పాడు సోమన్న.

సోమన్న గుర్రాన్నెక్కి, దౌడు తీయించాడు. వాడు ఎంతకూ తిరిగి రాకపోయేసరికి, గుర్రాల బేరగాడు కేకలు ప్రారంభించాడు. దారే పొయ్యేవాళ్ళు ఆగి, "ఎందుకేడుస్తున్నావు?" అని అడిగారు.

"అవ్వాలవాడు నా గుర్రాన్ని ఎత్తుకుపోయాడు," అన్నాడు గుర్రాల బేరగాడు, మరింతగా కేకలు పెడుతూ.

"అవ్వాల వాడైనాక గుర్రాన్ని ఎత్తుకుపోక ఏంచేస్తాడు?" అని దారేపొయ్యేవాళ్లు తమ దారిన వెళ్ళిపోయారు.

సోమన్న గుర్రం మీద వెళ్ళగా వెళ్ళగా ఒక కాలవ వచ్చింది. ఆ కాలవ దాటటానికి ఇవతలి గట్టున ఒక ముసలిదీ, ఒక పడుచు పిల్లా కూర్చుని ఉన్నారు. బల్లకట్టు అవతలి ఒడ్డున కట్టేసి ఉన్నది. బల్లకట్టువాడి జాడలేదు.

సోమన్న ముసలిదాన్ని పలకరించి, వాళ్ళ పరిస్థితి తెలుసుకుని, "మిమ్మల్నిద్దరినీ నేను కాలవ దాటిస్తాను. ముందు నీ మనమరాలిని అవతలికి చేర్చి, తరవాత నిన్నూ చేరుస్తాను," అన్నాడు.

"నీ పేరేమిటి, నాయనా?" అని ముసలిది అడిగింది.

"దానిమొంగుడు," అన్నాడు సోమన్న.

తరవాత వాడు పడుచుపిల్లను తనగుర్రం మీద ఎక్కించుకుని, కాలవ దాటి వెనక్కు తిరిగి చూడకుండా అదేపోత పోయాడు.

"నా మనమరాల్ని దానిమొంగుడు ఎత్తుకుపోయాడో!" అని ముసలిది కేకలు పెట్టింది. ఆ కేకలు విన్నవాళ్ళంతా ముసలిదాన్ని చూసి నవ్వారు.

చివరకు సోమన్న తన ఊరు చేరుకుని ఆ పిల్లను పెళ్ళాడి, తాను చేసిన ఘనకార్యాలు అందరికీ చెప్పాడు. గ్రామంలో వాళ్ళంతా వాడి తెలివికి మెచ్చుకుని, వాడికి తిండీ బట్టకు కరువులేకుండా జీవనోపాధి ఏర్పాటు చేశారు.





# తెలివి తక్కువ నవాబు

ఒక నవాబు ఒకనాడు తన పరివారంతో నగరం వెలపలకు షికారు బయలుదేరాడు. కొంత దూరం వెళ్ళేసరికి ఒక మర్రిచెట్టు మీద, ఆకులు కోస్తూ, ఒక కుర్రవాడు నవాబుకు కనిపించాడు.

వెంటనే నవాబు ఆ కుర్రవాణ్ణి చెట్టు దిగి రమ్మని ఆజ్ఞాపించి, "ఎవర్రా నువ్వు? ఆ చెట్టు ఆకులు ఎందుకు కోస్తున్నావు?" అని అడిగాడు.

"మేం పేద బ్రాహ్మలం. భోజనానికి విస్తళ్లు లేవు. విస్తళ్లు కుట్టుకోవటాని కని ఈ ఆకులు కోస్తున్నాము," అన్నాడు కుర్రవాడు.

బ్రాహ్మడైన ప్రతివాడూ కవిత్వం చెప్ప గలడని నవాబు నమ్మకం. అందుచేత ఆయన కుర్రవాడితో, "నువ్వు బ్రాహ్మణ పిల్లవాడివైతే నా మీద కవిత్వం చెప్పు, చూస్తాం," అన్నాడు.

ఆ కుర్రవాడికి వచ్చిన చదువే అంతంత మాత్రం, కవిత్వం మొదలే రాదు. కవిత్వం రాదంటే నవాబు చంపేస్తాడని అనుమానం వేసి, వాడు సాహసించి, "అయ్యా, తమ పేరేమిటో చెప్పండి," అని అడిగాడు.

తన పేరు బుల్‌బుల్‌ఖాన్ అని నవాబు చెప్పాడు. కుర్రవాడు తడుముకోకుండా, "ఓ బుల్‌బుల్‌ఖాన్! నా బుల్‌బుల్‌ఖాన్, మా బుల్‌బుల్ ఖాన్, హా బుల్‌బుల్‌ఖాన్" అంటూ దండకం చదివాడు.

ప్రతి పదంలోనూ తన పేరు రావటం చూసి నవాబు పరమానందం చెంది, తన వెంట ఉన్న ఖాసింఖాన్ చేత ఆ కుర్ర వాడికి డబ్బు సంచీ ఇప్పించి, తన దారిన తాను వెళ్ళాడు.

కుర్రవాడు ఆ డబ్బుసంచీ తీసుకుని ఇంటికి పోయి, జరిగిన దంతా తన తల్లికి చెప్పాడు. తన కొడుకు చెప్పిన కవిత్వానికి

కె. నాగరాజకుమారి, ఎ. భాస్కర్

తల్లి విరగబడి నవ్వి, వాడు చేసిన ఘన కార్యం గురించి గొప్పగా చుట్టుపక్కల అందరికీ చెప్పింది.

వీళ్ళ పొరుగునే రామశాస్త్రి అనే కవి పండితుడు ఉన్నాడు. ఆయనతో ఆయన భార్య, "మీరు ఇంత కాలంగా కవిత్వం రాస్తున్నారు. ఏం లాభం? పక్కింటి అబ్బాయి నవాబు మీద కవిత్వం చెప్పి, బోలెడు డబ్బు తెచ్చుకున్నాడు," అన్నది.

"అలా అయితే, నేను కూడా నవాబువారి దర్శనం చేసుకుని, ఆయన మీద మంచి కవిత్వం చెప్పి, డబ్బు తెస్తాను," అన్నాడు రామశాస్త్రి.

మర్నాడు ఉదయమే ఆయన నవాబు గారి దర్బారుకు వెళ్లి, బయట ఉండే ద్వార పాలకులతో, తాను బ్రాహ్మణుడినీ, కవిత్వం చెప్పగలననీ, నవాబుగారి పైన కవిత్వం చెప్ప టానికి వచ్చాననీ అన్నాడు. ఈ మాట నవాబు చెవిన పడగానే, రామశాస్త్రిని దర్బారులోకి ప్రవేశపెట్టమని హుకుం జారీ అయింది.

రామశాస్త్రి నవాబుకు వంగి సలాం చేసి, నవాబు పేరు చివర వచ్చేటట్టుగా ఒక రమ్యమైన, రసవత్తరమైన పద్యం చదివాడు.

నవాబుగారికి కవిత్వమంటే గౌరవం ఉన్నదే గాని అందులో ప్రవేశం ఏమీ లేదు.





# నేర్పుగల తీర్పు

ఒక ఊళ్లో రామయ్య, కామయ్య అని ఇద్దరు రైతు లుండేవారు. ఇద్దరూ స్నేహితులు. రామయ్య కొంచెం దయాగుణమూ, దాతృత్వమూ కలవాడు; ఎవరు కష్టంలో ఉన్నా తన శక్తికొద్ది ఆదుకునేవాడు. కామయ్య లోభి; చూస్తూ చూస్తూ ఒకరికి సాయం చెయ్యటం ఆయనకు సాధ్యమయేది కాదు. ఇరుగుపొరుగు వాళ్ళు కాస్త బాగుపడి, పచ్చగా కనబడితే ఓర్వలేకపోయే గుణం కూడా ఆయనలో ఉండేది.

ఇద్దరి పొలాలూ పక్క పక్కనే ఉండేవి. ఒకనాడు వారిద్దరూ పొలాల పక్కన గట్టు మీద కూర్చుని మాట్లాడుకుంటూ ఉండగా ఒక మనిషి వారి వద్దకు వచ్చి, "అయ్యా, నలుగురు పిల్లలవాణ్ణి. నా భార్య జబ్బుతో తీసుకుంటున్నది. వైద్యం చేయించు కుంటాను. కాస్త సహాయం చెయ్యండి," అని దీనంగా అడిగాడు.

"నీ బోటి వాళ్ళందరికీ డబ్బిస్తూ పోతే మాకీ నీ గతే అవుతుంది. పద, పద," అని కామయ్య ఆ మనిషిని కసిరాడు.

ఆ మనిషి రామయ్య కేసి మరింత దీనంగా చూశాడు. రామయ్య తన జేబులో నుంచి పదిరూపాయలు తీసి ఇస్తూ, "వెళ్ళు, నాయనా. నీ భార్యకు వెంటనే వైద్యం చేయించుకో," అన్నాడు.

రామయ్య అలా డబ్బిచ్చి ఆ మనిషిని పంపటం తనను అవమానపరచటమే నని కామయ్యకు తోచింది. అవకాశం దొరికితే రామయ్య మీద పగతీర్చుకుని, ఇంకా హెచ్చు అవమానం చెయ్యాలని కామయ్య నిశ్చయించుకున్నాడు.

కొంత కాలం గడిచింది. ఒకనాడు రామయ్య తన పొలాల పక్కగా ప్రవహించే కాలవకు వెళ్ళేసరికి ఒక అప్పుడూత కాలవలో కొట్టుకు వస్తూ ఉండటం కనబడింది.

ఉదయశంకర్



రామయ్య కాలవలోకి దిగి ఆ ఆవుదూడను ఒడ్డుకు తెచ్చి, తన చేతులలో ఎత్తుకుని ఇంటికి తీసుకుపోయాడు.

తలవని తలంపుగా దొరికిన ఆ దూడను చూసి రామయ్యభార్య కూడా ఎంతో ముచ్చటపడి, దానికి కుడితి పెట్టింది.

అది జరిగిన మర్నాడే కామయ్య రామయ్య ఇంటికి వచ్చి, దూడను చూశాడు. కామయ్య దాన్ని గురించి ప్రస్తావించకుండానే తన ఇంటికి తిరిగి వెళ్ళిపోయి, "రామయ్యకు ఆవులు లేవు గదా, దూడ ఎలా వచ్చింది? ఎక్కడో దొంగతనం చేసి ఉంటాడు. ఈ దొంగతనం గురించి గ్రామాధికారితో ఫిర్యాదు చేసినట్టయితే ఇక రామయ్య ఊళ్లో తలఎత్తుకు తిరగలేడు. పదిమందిలో చచ్చే అవమానం అవుతుంది," అని తనలో అనుకున్నాడు.

కామయ్య ఆ సాయంకాలమే గ్రామాధికారి వద్దకు వెళ్ళి, "అయ్యా, నిన్న రాత్రి మా ఆవుదూడను ఎవరో ఎత్తుకు పోయారు. ఇవాళ రామయ్య ఇంటికి వెళితే అక్కడ ఒక దూడ కనిపించింది. అది మా దూడ లాగే ఉన్నది. రామయ్య మా దూడను దొంగిలించాడని నా అనుమానం. అతనికి ఆవులే లేవు," అన్నాడు.

వెంటనే గ్రామాధికారి, దూడతో సహా రమ్మని రామయ్యకు కబురు పంపాడు. కబురందుతూనే రామయ్య దూడతో సహా వచ్చాడు. అక్కడ తన మిత్రుడైన కామయ్య ఉండటం చూసి రామయ్యకు ఆశ్చర్యం వేసింది.

"ఏమండీ రామయ్యగారూ, దూడను తోలుకొచ్చారా? సరే, మీకు ఆవులు ఉన్నాయా?" అని గ్రామాధికారి అడిగాడు.

"లేవండీ," అన్నాడు రామయ్య.

"ఆవులే లేవా? అయితే మరి మీ కీ దూడ ఎలా వచ్చింది?" అని గ్రామాధికారి అడిగాడు.



"కాలవలో కొట్టుకువస్తూ దైవికంగా నాకు దొరికింది. ఇంటికి తెచ్చి పెంచుకుంటున్నాను," అని రామయ్య జవాబు చెప్పాడు.

కామయ్య ఆగ్రహం తగిలి, "ఎందుకు, రామయ్యా, గ్రామాధికారిగారి దగ్గిర కూడా అబద్ధాలాడతావు? నువు నా దూడను కాజెయ్యలేదూ?" అన్నాడు.

గ్రామాధికారి కామయ్యను శాంతించమని హెచ్చరించి, "రామయ్యగారూ, దూడ కాలవలో కొట్టుకొచ్చిందంటే ఎవరన్నా చూసిన వాళ్ళుంటే నమ్మవచ్చు గాని, లేకపోతే ఎవరు నమ్ముతారు చెప్పండి. కామయ్యగారు ఆవులు గలవాడు. ఆయన తన దూడ పోయిందంటున్నాడు. ఏం చెబుతారు?" అన్నాడు.

"తమ ఇష్టం! నేను ఉన్న సంగతి చెప్పాను. అది నాకు కాలవలో దొరికినప్పుడు అక్కడ ఎవరూ లేరు. నేను సాక్ష్యం ఎక్కడి నుంచి తెచ్చేది?" అన్నాడు రామయ్య.

గ్రామాధికారి కొంచెం ఆలోచించి, "కామయ్యగారూ, ఈ దూడ తల్లి అయిన ఆవును తీసుకు రండి," అన్నాడు.

కామయ్య ఇంటికి వెళ్ళి తన ఆవులలో ఒకదాన్ని తోలుకు వచ్చాడు. గ్రామాధికారి దూడను ఆవు దగ్గిరికి వదిలాడు. దూడ ఆవు దగ్గిరికి పోయి పాలుతాగలేదు. ఆ ఆవు దూడ కేసి చూడనైనా చూడలేదు.

గ్రామాధికారి కామయ్యకేసి తిరిగి, "ఈ ఆవు ఈ దూడ తల్లికాదు. రామయ్యగారు చెప్పినదే నిజమని రుజువయింది. ఆయనను అవమానపరచాలని ఆయన మీద లేని నేరం ఆరోపణ చేసినందుకు నీ మీద జరిమానా వేస్తున్నాను," అన్నాడు.

రామయ్య తన దూడను తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు. కామయ్యకు ఊరివాళ్ళ మధ్య తీరని అవమానం జరిగింది.





# బీర్బల్ తెలివి

ఒకసారి అక్బరుపాదుషా నిండు సభలో బీర్బల్‌తో, "బీర్బల్, సృష్టిలో అత్యంత విశ్వాసం గల జంతువునూ, అత్యంత విశ్వాస హీనమైన జంతువునూ చూడాలని ఉన్నది. తెచ్చి నాకు చూపగలవా?" అని అడిగాడు.

తన ఇంటనే ఉంది, ఎంత చేసినా సంతృప్తి ఎరగని తన అల్లుడికి గుణపాఠం నేర్పాలని బీర్బల్ ఎదురు చూస్తున్నాడు. అందుచేత అతను మర్నాడు తన పెంపుడు కుక్కను వెంటబెట్టుకుని దర్బారుకు బయలుదేరుతూ, తన అల్లుణ్ణి కూడా రమ్మని ఆహ్వానించాడు.

పాదుషా బీర్బలును చూసి, "బీర్బల్, విశ్వాసం గల జంతువునూ, విశ్వాస హీనమైన జంతువునూ తెమ్మన్నాను, తెచ్చావా?" అని అడిగాడు.

"తెచ్చాను, హుజూర్. ఇది నా కుక్క. దీనికి గల విశ్వాసం సృష్టిలో మరే ప్రాణికీ లేదు. దీని పొట్టకింత తిండి వేస్తాను. అది నన్ను చూడగానే తోకాడించి, సంతోషం ప్రకటిస్తుంది. ఎంత తిట్టినా, కొట్టినా కూడా దానికి నా మీద గల విశ్వాసం తగ్గదు." అన్నాడు బీర్బల్.

"బాగానే ఉంది. మరి విశ్వాసహీనమైన జంతువేది?" అని పాదుషా అడిగాడు.

"ఇదుగో, నా అల్లుడు! ఇతనే విశ్వాస హీనమైన జంతువు. ఎంత పెట్టినా ఇతనికి తృప్తి లేదు, సంతోషం లేదు. ఇంకా తెమ్మంటాడు," అన్నాడు బీర్బల్.

"అలాగా? అయితే ఇప్పుడే అతని తల తీయిస్తాను. నా రాజ్యంలో విశ్వాసహీను లుండరాదు," అన్నాడు అక్బరు, బీర్బలును పరీక్షించటానికి.

"తొందరపడకండి, హుజూర్. మనమంతా అల్లుళ్ళమే. అవిశ్వాస గుణం అందరు అల్లుళ్ళకూ ఉండేదే!" అన్నాడు బీర్బల్.

ఎ. గోపాలరావు





అక్బరు అతని మాటకు చాలా సంతోషించాడు.

• • •

ఒక్కొక్కసారి బీర్బల్ హాస్యధోరణి మితి మీరిపోయేది. ఒకరోజు అతను పాదుషాను, "హుజూర్, రోజూ సూర్యుడు పడమట ఎందుకు దాక్కుంటాడు?" అని అడిగాడు.

"అటువంటి ప్రశ్నలు ఎవరైనా మూర్ఖుణ్ణి అడుగు," అన్నాడు అక్బరు.

"అందుకే గదా తమరిని అడిగాను?" అన్నాడు బీర్బల్.

అక్బరు ఆ మాటకు ఆగ్రహించక, నవ్వి ఊరుకున్నాడు.

• • •

ఒకనాడు అక్బర్ తన సభికులను, "ఇరవైఏడులో తొమ్మిది తీసేస్తే ఎం మిగులుతుంది?" అని అడిగాడు.

అందరూ ఒక్కసారిగా, "పద్దెనిమిది," అని బడిపిల్లల లాగా జవాబిచ్చారు.

అక్బరు బీర్బల్ కేసి చూశాడు.

"ఇరవైఏడులో తొమ్మిది తీసేస్తే ఇంకేం మిగులుతుంది, హుజూర్? ఏమీ మిగలదు," అన్నాడు బీర్బల్.

అందరూ ఆ సమాధానానికి చాలా ఆశ్చర్యపోయారు.

"ఏమీ మిగలదని ఎలా చెప్పగలవు?" అని అక్బరు బీర్బలును అడిగాడు.

"సంవత్సరానికి ఇరవైఏడు కార్తెలు. అందులో వర్షాకాలానికి చెందిన తొమ్మిది కార్తెలూ తీసేస్తే, మిగిలినవి ఉంటేం, లేకేం?" అన్నాడు బీర్బల్. అక్బరు అతనికి మంచి బహుమానం ఇచ్చాడు.

• • •

మరొనాడు దర్బారులో, అక్బరు మంత్రులలో ఒకరైన అబుల్ ఫజుల్ బీర్బల్‌తో, "బీర్బల్, పాదుషావారు నిన్ను రాజ్యంలోని కుక్కలన్నిటికీ అధికారిగా వేద్దామనుకుంటున్నారు," అన్నాడు.





"శెభాష్. అప్పుడు నేను నీ మీద అధికారం చలాయించ గలుగుతాను," అన్నాడు బీర్బల్. ఈ మాటకు అక్బరు విరగబడి నవ్వసాగాడు. ఆటుతరవాత అబుల్‌ఫజల్ బీర్బల్ జోలి కెన్నడూ పోలేదు.

* * *

ఏ బుద్ధిన ఉండో పాదుషా బీర్బల్‌కు ఒక జాగీరిస్తానని మాట ఇచ్చాడు. కాని ఆ మాట నిలబెట్టుకోలేదు. బీర్బల్ ఆ మాట జ్ఞాపకం చేసినప్పుడల్లా పాదుషా భుజాలు ఎగరేసేవాడు.

ఒకసారి అక్బరు. "బీర్బల్, ఒంటెమెడ అన్ని మెలికలు తిరిగివుండటానికి కారణం ఏమై ఉంటుంది?" అని అడిగాడు.

"ఏముంది, హుజూర్? అది ఎవరికో జాగీరిస్తానని మాట ఇచ్చి, ఆ సంగతి జ్ఞాపకం చేసినప్పుడల్లా భుజాలు ఎగరేస వుంటుంది." అన్నాడు బీర్బల్. వెంటనే బీర్బలుకు జాగీరు ముట్టింది.

ఒకసారి బీర్బల్ దూరపు బంధు వొకడు దారుణమైన నేరం చేశాడు. పాదుషా ఆతణ్ణి విచారణ చేసి అతనికి మరణదండన విధించాడు. ఆ రోజు బీర్బల్ సభకు హాజరు కాలేదు. కాని నిందితుడికి మరణశిక్ష విధించే చోటికి అక్బరు వెళ్ళినప్పుడు బీర్బల్ కూడా ఆ ప్రదేశానికి వెళ్ళి పాదుషాకు వంగి సలాం చేస్తూ, "హుజూర్, ఒక్క చిన్న విన్నపం," అని జంకుతూ అన్నాడు.

"బీర్బల్, నువ్వేమి అడగబోతున్నావో నాకు తెలుసు. నేను నీ కోరిక నిరాకరించబోతున్నాను. అయినా నువు కోరేదేమిటో చెప్పు," అన్నాడు అక్బరు.

"హుజూర్, ఈ నేరస్థుణ్ణి దయుంచి విడిచిపెట్టకండి. అదే నా విజ్ఞాపన," అన్నాడు బీర్బల్.

బీర్బల్ యుక్తికి ఆశ్చర్యపడి పాదుషా నేరస్థుణ్ణి విడిచిపెట్టమని తన భటులకు ఆజ్ఞ ఇచ్చాడు.





# ముగ్గురు ఘనులు

ఒక గ్రామంలో ఒక ధనవంతు డుండే వాడు. అతని పేరు నారాయుడు. ఆ చుట్టు పక్క గ్రామాలలో నారాయుడును మించిన స్థితిపరుడు మరెవరూ లేడు. అందుగురించి నారాయుడు చాలా గర్వపడేవాడు. తాను గొప్ప షావుకారు నన్న సంగతి నారాయుడు మరిచిపోదామన్నా ఇతరులు మరిచిపోనిచ్చే వాళ్ళు కారు.

ఆ పక్క గ్రామంలోనే వెంకటస్వామి అని ఒక రైతు ఉండేవాడు. అతనికి వందకు పైగా పశువులుండేవి. అతని కున్న పశు సంపద ఆ చుట్టుపక్కల మరొకడికి లేదు. అందుగురించి కూడా వెంకటస్వామికి చాలా గర్వం ఉండేది.

ఈ రెండు గ్రామాలకూ దగ్గరలోనే మల్లయ్య అనే మహా బలశాలి ఒకడుండే వాడు. అతన్ని మించిన బలశాలి కూడా ఆ చుట్టుపక్కల ఎవడూ లేడు. కొత్త పేరు పడిన పహిల్వాను ఎవరు ఆ ప్రాంతాలకు వచ్చినా, మల్లయ్య అతన్ని వెతుక్కుంటూ వెళ్ళి, గోదాలోకి దింపి, కుస్తీ పట్టి, ఓడించి మరీ వచ్చేవాడు. తన వంటి బలశాలి మరిలేడన్న గర్వం మల్లయ్యకూ ఉండేది.

ఒక ఏడు శ్రీరామనవమికి భద్రాచలం వెళ్ళాలని ఈ ముగ్గురు ఘనులూ ఒకేసారి బయలుదేరారు. వారు కొన్ని రోజులు ప్రయాణించి ఒక రోజు సాయంకాలం ఒక సత్రానికి చేరారు. ఆ రోజే అదే సత్రానికి మరొక ఆయన కూడా వచ్చాడు.

ఆయన ఈ ముగ్గురినీ చూసి, "మీరెవరు? ఎక్కడి నుంచి వస్తున్నారు?" అని ప్రశ్నలు వేశాడు. వెంటనే నారాయుడు, "మీరు నన్నెరగక పోయినా నా పేరు విని ఉండవచ్చు. నన్ను నారాయుడు అని పిలుస్తారు. మా చుట్టు పక్కల నా అంత స్థితిపరుడు మరొకడు లేడు," అన్నాడు.

వై. గోవర్ధన్



అదేవిధంగా, తన కున్న పశు సంపద మరెవరికీ లేదని వెంకటస్వామీ, తన చేతిలో ఓడిపోని పహిల్వాను ప్రపంచంలోనే లేడని మల్లయ్యా తమను గురించి కొత్త వాడికి పరిచయం చేసుకుని, తాము భద్రాచలానికి ప్రయాణమైపోతున్నట్టు చెప్పారు.

"చాలా సంతోషం. భద్రాచలానికి దారి మా ఊరి మీదుగానే పోతుంది. మా ఊరు వచ్చినప్పుడు నా ఆతిథ్యం స్వీకరించి మరీ వెళ్ళాలి!" అన్నాడు కొత్తవాడు.

మన ముగ్గురు ఘనులూ ఆయన ఊరూ, పేరూ కూడా అడగకుండానే, "ఓ, దానికేం భాగ్యం?" అన్నారు దర్పంగా.



వాళ్ళు ఆ రాత్రి సత్రంలో గడిపి మర్నాడు ప్రయాణమయే సమయానికి కొత్తవాడు ఎక్కడా కనిపించలేదు.

వాళ్ళు తమ దారిన వెళుతూండగా ఝాముపొద్దెక్కేసరికి వారికి ఒక పక్కన విశాలమైన పచ్చిక బయలూ, అందులో వేలకొద్దీ పశువులూ కనిపించాయి. ఆ పచ్చిక బయలుకు కంచె కూడా ఉన్నది. ఆ కంచె నిడివి కనుచూపు మేరదాకా ఉన్నది.

పశుసంపదకు పేరుమోసిన వెంకటస్వామి, "ఈ మైదానానికి కంచె ఎందుకు కట్టారో? ఇక్కడ ఎన్ని గ్రామాల పశువు లున్నాయో చూశారా?" అని తన అనుచరులతో అన్నాడు.

ఇంతలో వాళ్ళకు ఎదురుగా ఒక మనిషి వచ్చాడు. వెంకటస్వామి ఆ మనిషిని, "ఈ కనిపించే పశువులు ఎన్ని గ్రామాలవి?" అని అడిగాడు.

"ఎన్ని గ్రామాలవేనా? అవన్నీ శంకరయ్యగారివే. ఈ ఆవరణ అంతా వారిదే!" అన్నాడు వాడు. ఆ మాట విని వెంకటస్వామి తెల్లబోయాడు.

"ఈ శంకరయ్యగారనే ఆయన ఉండే దెక్కడ?" అని నారాయణ, ఆ మనిషిని అడిగాడు.





"అదుగో, ఆ కనిపించే చెట్లు శంకరయ్యగారి ఇంటి ఆవరణలోవే," అన్నాడు ఆ మనిషి. ముగ్గురూ ముందుకు సాగారు.

పశువులుండే ఆవరణ దాటి కొద్దిదూరం వెళ్ళగానే ఒక విచిత్రమైన ప్రహరీ గోడా, దాని కొక ద్వారమూ కనపడ్డాయి. ద్వారం వద్ద ఒక బలమైన మనిషి కావలా ఉన్నాడు. "ఇది ఎవరి ఇల్లు?" అని మల్లయ్య కావలావాణ్ణి అడిగాడు.

"శంకరయ్యగారిది," అన్నాడు వాడు.

ఆ మాట వినగానే మల్లయ్య లోపలికి దారితీశాడు.

"ఎక్కడికి పోతున్నావు? ఆగు!" అని కావలావాడు గద్దిస్తూ మల్లయ్య భుజం మీద చెయ్యి వేసి నిలిపాడు.

మల్లయ్యకు మండిపోయింది. వాడి చెయ్యి విదిలించబోయాడు. కాని సాధ్యం కాలేదు. మల్లయ్య తన రెండు చేతులూ ఉపయోగించి, తన భుజంమీది నుంచి వాడి చెయ్యి తొలగించటానికి ప్రయత్నించాడు. కాని అతని వల్ల కాలేదు. మల్లయ్యకు చెమటలు పట్టసాగాయి.

ఇంతలో గుర్రం ఎక్కి, సత్రంలో కనిపించిన మనిషే వచ్చాడు.

"వచ్చారా? లోపలికి దయచెయ్యండి. నేను మీకన్న ముందే చేరుతాననుకున్నాను గాని, అనుకోకుండా ఆలస్యం అయింది. ఇదే మా యిల్లు," అన్నాడు అతను.

ముగ్గురూ వణుకుతున్న గుండెలతో లోపల అడుగుపెట్టారు. ఇల్లు ఇంద్రభవనం లాగున్నది. ఎక్కడ చూసినా దంతపు కుర్చీలూ, బంగారు, వెండి వస్తువులూ కనిపించాయి. ముగ్గురూ శంకరయ్య బంగారు కంచాలలో పెట్టిన భోజనం తిని, వినయంగా అతనికి వీడ్కోలు చెప్పి, తమ దారిన తాము సాగిపోయారు.

ఆటుతరవాత వాళ్ళు ఎన్నడూ ఎవరితోనూ తమ గొప్పలు చెప్పుకోలేదు.





# ప్రయత్నం-అదృష్టం

ఒక గ్రామంలో ఇద్దరు అన్నదమ్ములుండే వారు. వాళ్ళ ఇంటి పెరడులోనే కూరలు పండించి, వాటిని అమ్మి, అన్న తనను తాను పోషించుకుంటూ తన తమ్ముణ్ణి కూడా పోషిస్తూ వచ్చాడు. తమ్ముడు అన్నకు ఏ మాత్రమూ కృతజ్ఞత చూపకపోగా, ఏ పనిలోనూ ఏ మాత్రమూ సహాయపడేవాడు కాదు.

ఇలా కొంతకాలం గడిచాక, ఒకనాడు అన్న, "తమ్ముడూ, నువ్వు చెయ్యీ, కాలూ కదల్చకుండా కూర్చుంటే నేను నిన్ను ఎంత కాలమని పోషించేది? నీ బరువు మోసుకునేటందుకు నువ్వు కూడా ప్రయత్నం చెయ్యి," అన్నాడు.

తమ్ముడు అన్న చెప్పేది పట్టించుకోక, "అదృష్టం కలిసి రావాలి గాని, ప్రయత్నం వల్ల ఏమవుతుంది? నాకు మనుష్యయత్నంలో ఆవగింజంత నమ్మకం కూడా లేదు. నేను ఎలాటి ప్రయత్నమూ చెయ్యను," అన్నాడు.

ఈ మాటకు అన్నకు చాలా కోపం వచ్చింది. అన్నదమ్ములిద్దరూ వాదించుకున్నారు. అన్న మానవయత్నం లేందే ఏదీ సాధ్యం కాదన్నాడు. అదృష్టం కలిసి వచ్చినప్పుడు ఏ ప్రయత్నమూ అవసరం లేదన్నాడు తమ్ముడు.

ఎంతకూ వాదన తేలక అన్నదమ్ములిద్దరూ రాజుగారి దగ్గిరికి వెళ్ళి, తీర్పు చెప్పమన్నారు.

రాజుగారు ఇద్దరి వాదనా విని, "ఎవరు చెప్పేది నిజమో నేనూ తేల్చలేకుండా ఉన్నాను. మంత్రీ, నువ్వే వీరికి తీర్పు చెప్పు," అన్నాడు.

"ఈ రాత్రి నాకు గడువిచ్చినట్టయితే, రేపు ఉదయం, మీ ఇద్దరి వాదనలలో ఏది సరి అయినదీ చెప్పగలను," అన్నాడు మంత్రి.

కె. వసుధ



ఆ రాత్రికి మంత్రి అన్నదమ్ము లిద్దరినీ కాళికాదేవి గుడిలో ఖైదు చేయించాడు. ఆలయం లోపల కన్ను పొడుచుకున్నా కానరాని అంధకారం. అన్నదమ్ము లిద్దరూ చెరొకమూలా విచారిస్తూ కూర్చున్నారు.

కొంత రాత్రి గడిచాక ఇద్దరికీ ఆకలి దహించుకు పోనారంభించింది. అదృష్టాన్ని మాత్రమే నమ్ముకున్న తమ్ముడు ఆకలిని సహించి కూర్చున్న చోటనే ఉండి పోయాడు. కాని ప్రయత్నంలో నమ్మకం గల అన్న, బయటికి పోయే మార్గం ఏమైనా దొరుకుతుందేమోనని, చీకటిలో కారాడుతూ ఆలయం అంతా తిరగసాగాడు.

కొంతసేపు కారాడినాక అతని చేతికి ఒక గిన్నె తగిలింది. దాని నుంచి పాయసం వాసన వస్తున్నది. అతను దాన్ని రుచి చూసి, కాళికి పెట్టిన నైవేద్యం అయి ఉంటుందనుకుని, నిశ్చింతగా దాన్ని ఆరగించసాగాడు. అందులో మధ్య మధ్య రాళ్ళలాటివి వస్తే, వాటిని తన తమ్ముడి కేసి గిరవాటు వేశాడు.

పాయసం అయిపోయింది. అన్న ఆకలి బాధ ఉపశమించింది. చేతులు కట్టుకు కూర్చుని, ఏ ప్రయత్నమూ చేయనందుకు తన తమ్ముడికి ఆకలిబాధ ద్వారా తగిన శాస్తి అయిందనుకుని అన్న సంతోషించాడు.



ఈ దెబ్బతో మానవయత్నం విలువ తమ్ముడికి తెలిసివస్తుందని అతను అనుకున్నాడు.

మర్నాడు తెల్లవారగానే మంత్రి పంపిన భటులు వచ్చి, అన్నదమ్ములను కాళికా దేవిగుడి నుంచి చెర విడిపించి, రాజసభకు తీసుకుపోయారు.

మంత్రి వారిని చూసి, "పాపం, రాత్రంతా ఖైదులో వున్నారు. కాలం ఎలా గడిచింది?" అని అడిగాడు.

"దేనికైనా మానవయత్నం అవసరమని రాత్రి నిరూపించాను. చీకట్లో తడువుకుంటూ వెళ్ళి, నేను పాయసం తిని, ఆకలి తీర్చుకుని, హాయిగా నిద్రపోయాను," అన్నాడు అన్న.

మంత్రి తమ్ముడి కేసి తిరిగి, "నువేం చేశావు?" అని అడిగాడు.

"నేను ఏమీ చెయ్యలేదు. ఒక మూల కూర్చున్నాను. కొంతసేపు అయాక మా అన్న నా మీదికి ఏవో రాళ్ళు విసిరాడు. వాటన్నిటిని జాగ్రత్తగా పొగుచేసి దాచుకున్నాను," అన్నాడు తమ్ముడు.

"ఆ రాళ్ళు ఇప్పుడు నీ దగ్గిర ఉన్నాయా? ఏవీ చూపించు," అని మంత్రి అన్నాడు.

తమ్ముడు తన బట్ట కొంగున కట్టి, బొడ్డులో దోపుకున్న మూట విప్పి చూపించాడు. ఆ రాళ్ళన్నీ ఎంతో విలువగల రత్నాలు!

"చూశారా, మహారాజా? మీ ఇద్దరి వాదమూ పరిష్కరించేటందుకు నే నీ పరీక్ష పెట్టాను. అన్న ప్రయత్నానికి దక్కిన ఫలితంతో పోలిస్తే తమ్ముడికి అదృష్టం ఎంత హెచ్చు ఫలితం ఇచ్చిందో చూడండి. అదృష్టం లేకపోబట్టే, అన్న తనకు దొరికిన రత్నాలను రాళ్ళనుకుని తన తమ్ముడి మీద గిరవాటు వేశాడు," అన్నాడు మంత్రి.

ఆ రత్నాలను తమ్ముడే ఉంచుకునేటందుకు రాజు అనుమతించాడు. తరవాత అన్నదమ్ములు తమ యింటికి వెళ్ళిపోయారు.





# కృష్ణావతారం

తన దక్షిణాది మిత్రులు చెప్పిన సలహా తలకెక్కి, రుక్మి, చక్కగా అలంకరించి ఉన్న సభాభవనంలో జూదం ఆడటానికి ఒక బంగారు పలకా, పావులూ, పాచికలూ ఏర్పాటు చేయించి, సరదాగా జూదం ఆడదాం రమ్మని బలరాముడికి కబురు పంపాడు. ద్యూతప్రియుడైన బలరాముడు వెంటనే ఉత్సాహంతో వచ్చాడు.

బలరాముడితో రుక్మి ఆడితేనే బాగుంటుందని దాక్షిణాత్యులు అన్నారు. పందెం కాయటానికి ముత్యాలూ, మణులూ, బంగారమూ కుప్పలు పోశారు. జూదం ఆరంభమయింది. పదివేల బంగారు మాడలు పందెంకాచి బలరాముడు ఓడిపోయాడు. మళ్ళీ అంతే పందెంకాచి మళ్ళీ ఓడాడు. అదే విధంగా ప్రతిసారీ బలరాముడే ఓడుతూ వచ్చాడు.

చిట్టచివరకు బలరాముడు కోటి బంగారు మాడలు పందెంకాచి గెలిచాడు. కాని రుక్మి గెలుపు తనదేనని గట్టిగా కేకపెట్టాడు. "బలరాముడికి పందెం వెయ్యటమే చేత కాదు. నేను కోటి బంగారం గెలుచుకున్నాను, చూసుకోండి," అన్నాడతను.

అతని మిత్రుడైన కళింగరాజు, "నిజమే! అంతే!" అంటూ పళ్ళన్నీ బయటపెట్టి నవ్వాడు. బలరాముడికి కోపం వచ్చింది. కాని అతను తనను తాను నిగ్రహించుకుని, అక్కడ చేరినవాళ్ళతో, "పందెం నేను గెలిస్తే, ఇతను తాను గెలిచానంటాడేమిటి? మీరు నిజం చెప్పండి," అన్నాడు.

19. నరకుడి విజృంభణ



అందరూ తలలు వంచుకున్నారు. ఒక్కరూ జవాబు చెప్పలేదు.

రుక్మి బలరాముడితో, "నేను గెలిచానన టానికి సందేహమేమీ లేదే! ఎందుకిలా కక్కుర్తిపడి అబద్ధాలాడుతున్నావు?" అన్నాడు. అంత పచ్చి అబద్ధానికి ఏమి సమాధానం చెప్పాలో బలరాముడికి అర్థం కాలేదు. ఇంతలో ఆకాశవాణి, "బల రాముడి మాటే నిజం. రుక్మి అబద్ధ మాడాడు. మీరంతా మొద్దులల్లే చూస్తూ ఊరుకుంటారేం?" అని పలికింది.

అప్పటికీ ఎవరూ మాట్లాడలేదు. బల రాముడు ఇక నిగ్రహించుకోలేక ఆవేశంతో



రుక్మిని ఒక్క గుద్దుతో హతమార్చి, జూదప్పలక తీసుకుని కాళింగుడి తల పగిలేటట్టు కొట్టాడు. మిగిలిన రాజులు తన పైకి వస్తే, కత్తి దూసి ఊచకోత కోశాడు. ఇలా కొందరు చావగా, మిగిలినవాళ్ళు బెదిరి పారిపోయారు.

బలరాముడిలా బీభత్సం చేసి, తన బసకు వెళ్ళి, కృష్ణుడితో జరిగిన సంగతి చెప్పాడు. కృష్ణుడు జరిగినదాన్ని గురించి ఆక్షేపించలేదు, హర్షించనూలేదు. కాని మిగిలిన యాదవులు బలరాముణ్ణి తెగ మెచ్చుకుని, అతనికి చాలా తృప్తి కలిగించారు.

ఆ తరవాత అందరూ వధూవరులను వెంటబెట్టుకుని ద్వారకకు తిరిగి వచ్చేశారు.

బలరాముడు సాటిలేని బల పరాక్రమాలూ, శక్తి సామర్థ్యాలూ కలవాడు. పది వేల ఏనుగుల బలం కలవాడని ఖ్యాతి పొందిన భీముడు బలరాముడి వద్దనే శిక్షణ పొందాడు. ఇద్దరికీ యుద్ధం జరిగే పక్షంలో భీముడు గెలుస్తాడన్న నమ్మకం కూడా ఉండేదికాదు.

ఒకసారి కృష్ణుడి కొడుకైన సాంబుడు, దుర్యోధనుడి కుమార్తె అయిన లక్షణను మోహించి, ఆమెను తీసుకుని పారిపో







సాగాడు. అప్పుడు కౌరవులు సాంబుణ్ణి తరిమి పట్టుకుని, హస్తినాపురానికి తెచ్చి, చెరలో ఉంచారు. అది తెలిసి బలరాముడు ఉగ్రుడై హస్తినాపురానికి వచ్చి సాంబుణ్ణి విడిచిపుచ్చుమని మర్యాదగా అడిగాడు. అందుకు కౌరవులు ఒప్పుకోలేదు.

అప్పుడు బలరాముడు హస్తినాపురాన్ని జనంతోనూ, ఇళ్ళతోనూ సహా గంగలోకి తోస్తానని ప్రతిజ్ఞచేసి, ప్రాకారం కింద తన నాగలి వేసి ఎత్త నారంభించాడు.

దుర్యోధనుడు మొదలైన వాళ్ళంతా బెదిరిపోయి, సాంబుణ్ణి తెచ్చి బలరాముడికి అప్పగించి, శాంతింపజేశారు. అప్పుడే దుర్యోధనుడు బలరాముడికి తాను శిష్యుడుగా ఉంటానని చెప్పి, గురుపూజ చేశాడు. బలరాముడి మూలాన హస్తినాపురం శాశ్వతంగా ఒక పక్క పైకి లేచి, రెండోవైపు ఏటవాలుగా ఉండిపోయింది. దుర్యోధనుడు బలరాముడి శిష్యుడుగా గదాయుద్ధంలో సాటిలేని కీర్తి సంపాదించాడు.

ఇది ఇలా ఉండగా రాక్షస ప్రపంచంలో నరకుడనేవాడు ప్రచండుడుగా పైకి వచ్చాడు. అతని రాజధాని ప్రాగ్జ్యోతిషపురం. అతను భూదేవి కొడుకు. బ్రహ్మచేత వరాలు పొందినవాడు. ఏ దేవతలకూ ఓడే వాడు కాడు. అన్ని లోకాలనూ తన బల పరాక్రమాలతో అదలగొట్టసాగాడు.

నరకుడు ముందుగానే ఇంద్రుడి నగరానికి తన రాక్షససేనతో సహా వెళ్ళి, నగర ద్వారాలను తన పిడికిలి పోట్లతో పగలగొట్టి, సింహనాదం చేసి, యుద్ధానికి రమ్మని ఇంద్రుణ్ణి పిలిచాడు. ఇంద్రుడు వచ్చాడు. వజ్రాయుధం చేతబట్టి, ఐరావతాన్ని ఎక్కి వచ్చిన ఇంద్రుణ్ణి ఏమాత్రమూ లక్ష్యపెట్టక, నరకుడు అతనితో యుద్ధానికి తలపడ్డాడు. ఇంద్రుడికి తోడుగా యమ, వరుణ, కుబేరులు తమ సైన్యాలను తెచ్చి, యుద్ధంలో పాల్గొన్నారు.



నరకుడికి కూడా ముగ్గురు రాక్షస నాయకులు, హయగ్రీవుడూ, నికుంభుడూ, మురుడూ అనేవాళ్ళు, తోడుగా ఉన్నారు. వారిలో హయగ్రీవుడితో వరుణుడు యుద్ధం చేసి, తల పగిలి, నెత్తురు కక్కుకూ, మూర్ఛపోయి, స్పృహ తెలియగానే పారిపోయాడు. వరుణుడితోనే అతని సేన కూడా పోయింది. అలాగే నికుంభుడి చేతిలో యముడూ, మురాసురుడి చేతిలో కుబేరుడూ చావు దెబ్బలు తిని, సైన్యాలతో సహా పారిపోయారు. చివరకు నరకుడి దెబ్బకు తట్టుకోలేక ఇంద్రుడు కూడా పారిపోయాడు. నరకుడు అమరావతీ నగరం



ప్రవేశించి, తన విజయాన్ని దేవలోక మంతటా చాటింపు చేయించాడు.

తరవాత నరకుడు ఇంద్రుడి సింహాసనం అధిష్ఠించి, ఊర్వశిని పిలిపించి, "దిక్పాలకు లందరినీ ఓడించాను. సమస్త దేవతలకూ ఇక నేనే రాజును. అందుచేత ఇక నుంచీ నన్ను నువ్వు సుఖపెట్టు," అన్నాడు.

దానికి ఊర్వశి, "అలాగా? అయితే మునులందరూ యజ్ఞాలలో నిన్నే పూజించినట్టయితే నేను విధిగా నీకు ఉంపుడుగత్తెగా ఉంటాను," అన్నది. నరకుడు సరేనన్నాడు. అతను అమరావతిని కొల్లగొట్టి, సుమేరు పర్వతంలోని రత్నరాసులన్నీ తవ్వించి, ఎనిమిదివేల దేవకన్యలను చెరపట్టి, విశ్వకర్మ కూతురిని కూడా తీసుకుని, రత్నాలు పొదిగిన అదితి కుండలాలు సంగ్రహించి, తన నగరానికి తిరిగి వచ్చాడు.

నరకుడి ఆజ్ఞపొంది అతని అనుచరులైన రాక్షసులు పధ్నాలుగు లోకాలలోనూ, ఎక్కడ ఏ విలువగల వస్తువున్నా, దాన్ని తెచ్చి అతనికి ఇస్తూ వచ్చారు. వాళ్ళు పోయిన చోటనల్లా పీడన కలిగిస్తూ, అప్సర స్త్రీల నందరినీ తెచ్చారు, పదహారువేల ఒక వంద గంధర్వ కన్యకలనూ, అనేక లక్షల యక్ష స్త్రీలనూ, అసంఖ్యాకులైన కిన్నర,



సిద్ధ, సాధ్య, విద్యాధర స్త్రీలనూ చెర పట్టి తెచ్చారు.

ప్రాగ్జ్యోతిష నగరాన్ని నాలుగు పక్కలా నలుగురు మహాయోధులు — మురుడూ, హయగ్రీవుడూ, నిశుంభుడూ, పంచజనుడూ రక్షించేవారు. మురాసురుడికి వేల సంఖ్యలో కొడుకులుండేవారు. వాళ్ళ మూలాన నరకుడి నగరం ఎలాటి వారికీ చొరరానిదిగా ఉండేది.

నరకుడికి భూలోకమంతా వశపరచుకోవాలనిపించింది. అతను అంతటా తిరుగుతూ యజ్ఞాలు ధ్వంసం చేశాడు, బ్రాహ్మణులను చంపాడు, మునులను హింసించాడు, రాజులందరినీ రకరకాలుగా పీడించాడు, ధర్మనాశనాన్నే తన ఆశయంగా పెట్టుకున్నాడు.

ఒకసారి నరకుడు బదరీవనానికి వెళ్ళేసరికి అక్కడ అనేకమంది ఋషులు యజ్ఞకార్యంలో మునిగి ఉన్నారు. అప్పుడు నరకుడికి ఊర్వశి అన్న మాట జ్ఞాపకం వచ్చింది. అతను వాళ్ళను, "ఎవరిని తలపెట్టి ఈ యజ్ఞం చేస్తున్నారు?" అని అడిగాడు.

"వేదాలు చెప్పిన విధంగా ఇంద్రుణ్ణి గురించి యజ్ఞం చేస్తున్నాం," అని వాళ్ళు జవాబు చెప్పారు.



ఈ మాటకు నరకుడు అలిగి, "మీ ఇంద్రుణ్ణి వరుణ యమ కుబేర సహితంగా నేను యుద్ధంలో ఓడించాను. అతని రాజ్యమంతా గెలుచుకున్నాను. విశ్వానికంతకూ నేనే ఏలికను. అందుచేత నన్నే కొలవండి. నాకే మొక్కండి. నన్ను సంతృప్తిపరచినట్టయితే నేను మీ కోరికలు తీర్చుతాను," అన్నాడు.

దానికి ఋషులు, "ఈ మాట ఏంత మాత్రమూ సబబుగాలేదు. లోకాలను పాలించవలసినవాడు ఇంద్రుడు. నువ్వు దుష్ట రాక్షసుడివి. నిన్ను మే మెలా కొలుస్తాం?" అన్నారు.



నరకుడు ఈ మాటకు మండిపడి తన బంట్లతో, "ఈ బ్రాహ్మణులు మదమెక్కి కారుకూతలు కూస్తున్నారు. వీళ్ళ యజ్ఞం ధ్వంసం చెయ్యండి," అన్నాడు. వెంటనే రాక్షసులు అగ్నికుండాలు పూడ్చి, పశువులను నాశనం చేసి, హోతలనూ, ఉద్గాతలనూ, సదస్యులనూ చావగొట్టి, స్రుక్స్రువాలను అవతల పారేసి, అరణులు కాల్చి, హవిస్సులు తినేసి, అన్నపురాసులు చిమ్మేసి, సోమరసాన్ని బూడిదపాలు చేసి, ఋషిపత్నులను చెరిచి, వాళ్ళ కన్యలను చెరపట్టి, నానా బీభత్సమూ చేశారు. తరవాత నరకుడు తిరిగి వెళ్ళిపోయాడు.



ఆ తరవాత వసిష్ఠుడూ, వామదేవుడూ, కపిలుడూ, కశ్యపుడూ, కణ్వుడూ, జాబాలీ, ధూమ్యుడూ, భరద్వాజుడూ, మంకణుడూ మొదలైన మహాఋషులందరూ కూర్చుని, తమ యజ్ఞం ఇలా ఎందుకు విఘ్నమయిందో, పతివ్రతలయిన తమ స్త్రీలు ఇలా ఎందుకు దోషానికి గురి అయారో అని విచారించారు. అటువంటి దుర్మార్గుడి నుంచి తమను కాపాడేవాడు ఎవడో ఒకడు లేకపోతే ఇక బ్రతుకే ఉండదు. అవతారపురుషుడైన కృష్ణుడి వల్లనే తమకు గతి ఏర్పడాలని వారు నిశ్చయించుకుని, అందరూ కలిసి ద్వారకకు బయలుదేరారు.

వారు దక్షిణాభిముఖులై ప్రయాణంచేసి, దారిలో తగిలిన తీర్థాలలో స్నానాలు చేస్తూ, భాగీరథిని చేరి, అందులో కూడా స్నానం చేసి, ప్రాయశ్చిత్తాలు చేసుకుని, నిత్య ప్రయాణాలు చేస్తూ, స్వర్గాన్ని మించిన వైభవంతో తులతూగే ద్వారకానగరాన్ని చేరుకున్నారు.

ఆ నగరంయొక్క ఐశ్వర్యానికి ఆశ్చర్యపడుతూ వాళ్ళు రాజమార్గం వెంట రాచనగరు చేరుకుని, బదరీవనం నుంచి మహర్షులు వచ్చారని కృష్ణుడికి కబురు పంపారు.





కృష్ణుడు వారి రాక గురించి వినగానే ప్రద్యుమ్నుణ్ణి పిలిచి, ఋషులకు స్వాగతం చెప్పి తీసుకురమ్మని పంపాడు. ప్రద్యుమ్నుడు బయటికి వచ్చి, ఆదరంతో ఋషులకు స్వాగతం చెప్పి, వారిని కృష్ణుడు కొలువుదీరి ఉన్న చోటికి, తీసుకువెళ్ళాడు.

సభాభవనంలో యాదవులందరూ తనను కొలిచి ఉండగా, కృష్ణుడు ఉన్నతాసనం మీద కూర్చున్నాడు. మునులు అతన్ని చూసి, "మన కోరికలన్నీ తీర్చి రక్షించటానికి అతను ఉండగా, మనం ఇన్నాళ్ళూ ఆ రాక్షసుడి చేత ఎందుకని అంతగా అవమానాలు పొందినట్టు? ప్రారబ్ధ మంటే ఇలాగే ఉంటుందిగదా! పోనీ ఇప్పటికైనా ఈ మహాత్ముడి దర్శనం చేసుకున్నాం. తపస్సు, తపస్సు అంటూ అడవుల్లో అలమటించే మనకు ఆ రాక్షసుడి మూలంగా ఈ లాభం ఒకటి కలిగింది," అని తమలో అనుకుంటూ కృష్ణుణ్ణి సమీపించారు.

కృష్ణుడు గబగబా తన ఆసనం నుంచి దిగి వచ్చి, మునులకు నమస్కారం చేసి, వారికి ఆసనాలూ, అర్ఘ్యపాద్యాలూ, మధుపర్కాలూ ఇచ్చి సత్కరించి, వారి అనుమతి పొంది, తిరిగి తన ఆసనం మీద కూర్చున్నాడు. అతని తరవాత మిగిలిన యాదవప్రముఖులంతా మునులకు నమస్కారాలు చేసి తమతమ ఆసనాలలో తిరిగి కూర్చున్నారు.

అప్పుడు కృష్ణుడు చేతులు జోడించుకుని మునులతో, "మీ క్రతువులు నిర్విఘ్నంగా సాగుతున్నాయా? మీ వ్రతాలూ, తపస్సులూ యథావిధిగా జరుగుతున్నాయి గదా? మీరంతా ఇలా దయచేయటానికి కారణమేమిటి? నా మీదగల అనుగ్రహం కొద్దీ, నన్ను కృతార్థుణ్ణి చేయటానికే మీరిలా వచ్చి ఉంటారు. నాకు మీ రందరూ ఏదైనా పని చెప్పినట్టయితే, ఆ పని చెయ్యటానికి మేమంతా సంసిద్ధంగా ఉన్నాం," అన్నాడు.





# అరణ్యపురాణం

## 22

మౌగ్లీ మనుషుల మధ్యనుంచి అరణ్యానికి తిరిగి వచ్చాక, అతనికి కావాతో ఉండిన పాతస్నేహం అలాగే ఉండి పోయింది. ఆనాడు కోతులు తనను శిథిలాలకు ఎత్తుకు పోయినప్పుడు కావా వాళ్ళందరినీ చిత్రవధ చేసి తనను కాపాడిన సంగతి మౌగ్లీ ఏ నాడూ మరవలేదు.

కావా మరొకసారి కుబుసం విడిచిన సంగతి తెలిసి మౌగ్లీ అతన్ని పరామర్శించ డానికి వెళ్ళాడు. కుబుసాన్ని విడిచాక, కొత్త చర్మం కాస్త బిరుసెక్కే దాకా కావా నిస్తేజంగా ఉంటాడు.

మౌగ్లీ అప్పుడు కావాకు పాతనాటి మనిషి కానేకాడు. మిగిలిన అరణ్యవాసులందరితో బాటు కావా కూడా అతన్ని అరణ్యానికి నాయకుడుగా ఆమోదించి, అరణ్య వార్త లన్నీ అతనితో చెబుతున్నాడు.

అపరాహ్ణం అయింది. కావా శరీరపు చుట్టలమధ్య మౌగ్లీ, కుర్చీలో చేరగిల బడి కూర్చున్నట్టు కూర్చుని ఉన్నాడు. అతను చుట్టూతాపడి ఉన్న కావా కుబుసాన్ని వేళ్ళతోపట్టి చూస్తున్నాడు.

"కళ్ళ మీది పొరకూడా ఎంత స్పష్టంగా ఉందో!" అన్నాడు మౌగ్లీ.

"నీ చర్మం ఎన్నడూ పాతబడి పెళుసు బారదా?" అని కావా అడిగాడు.

"అలా అనిపించినప్పుడు వెళ్ళి స్నానం చేస్తాను. ఒక్కో, మరీ జాస్తిగా ఉన్నప్పుడు, చర్మమంతా ఊడిపోయి, పరిగెత్తితే బాగుండు నని అనిపించే మాట నిజం," అన్నాడు మౌగ్లీ.

"నేను చర్మమూ విసర్జిస్తాను, స్నానమూ చేస్తాను. కొత్త చర్మం ఎలా ఉంది?" అని కావా అడిగాడు.

అట్ట చివరి బొమ్మ



మౌగ్లీ కావా చర్మంమీది పొరల మీదుగా నిమురుతూ, "తాబేలు చర్మం ఇంకా గట్టిగా ఉంటుంది గాని దానికి సొంపు లేదు. సీతాకోకచిలుక రెక్కమీది చుక్కల్లాగా, చాలా అందంగా ఉంది," అన్నాడు.

"అది నీరు తగిలితే గాని మెరుపెక్కదు. వెళ్ళి స్నానం చేద్దాంపద," అన్నాడు కావా.

"నేను నిన్ను ఎత్తేదీ?" అంటూ మౌగ్లీ కావా మధ్య భాగాన్ని పట్టుకుని ఎత్తాలని చూశాడు. అది చచ్చినా కదలలేదు. కావా తమాషా చూస్తూ ఉండిపోయాడు.

ఆ తరవాత వాళ్ళ నిత్య వ్యాయామక్రీడ ఆరంభమయింది. ఇద్దరూ కుస్తీ పట్టే వాళ్ళు. అది బలానికీ, దృష్టికీ కూడా పరీక్ష. రెంటిలోనూ కావాదే పై చెయ్యి. కాని, మౌగ్లీ దృఢకాయుడయ్యాక, అతని శక్తులను పెంపొందించటానికి కావాయే ఈ ఆట మౌగ్లీకి నేర్పాడు. ఒకసారి కావా మౌగ్లీని తన చుట్టలలో పాదాలనుంచి కంఠందాకా చుట్టేసేవాడు. అప్పుడు మౌగ్లీ తన చేతిని విడిపించుకుని, కావా కంఠాన్ని పట్టుకోవటానికి ప్రయత్నించేవాడు. తరవాత కావా తన చుట్టలను కాస్త వదులు చేసేవాడు. మౌగ్లీ తన రెండు పాదాల కిందా కావా తోకను తొక్కి పట్టటానికి ప్రయత్నించేవాడు. కావా తన తలను మౌగ్లీ కేసి వేగంగా, కొట్టబోయేలాగా విసిరేవాడు. మౌగ్లీ అతి నేర్పుగా అతని తలను పక్కకు నెట్టేసి, దెబ్బను తప్పించుకో జూసేవాడు. కాని అది సాధ్యమయేది కాదు. మౌగ్లీకి దొరకకుండా కావా అతని శరీరాన్ని, తలచుకున్న చోటల్లా తలతో తాకేవాడు. చిట్టచివరకు కావా మౌగ్లీని ఒక్క గట్టిదెబ్బ కొట్టి, అంత దూరాన పడేటట్టు చెయ్యటంతో ఈ ఆట ముగిసేది. మౌగ్లీ నవ్వుతూ, రొప్పుతూ లేచి వచ్చేవాడు.

ఇవాళ కూడా ఈ ఆట అలాగే ముగిసింది. తరవాత ఇద్దరూ బండరాళ్ళ



మధ్యన ఉన్న చీకటి కోనేరుకు వెళ్ళి, అందులో ఈతలు కొట్టారు.

"ఇదే నిజమైన సుఖం. మనిషి మందలో ఈ సమయానికి మనుషులు మంచిగాలి రాకుండా తలుపులన్నీ బిగించి, కొయ్య బల్లలమీద పడుకుని, కంపుగుడ్డలు నిలువునా కప్పుకుని, ముక్కులకుండా ముదనష్టపు పాటలు ప్రారంభించేవాళ్ళు—నాకు బాగా జ్ఞాపకం. అరణ్యం చాలా మెరుగు," అన్నాడు మోగ్లీ మత్తుగా.

ఎక్కడనుంచో ఒక తాచుపాము రాళ్ళు దిగివచ్చి, నీరుతాగి, "వేటసాగాలి!" అని తన దారిన వెళ్ళిపోయాడు.

"అయితే, తమ్ముడూ. నీకు కావలసిన దంతా అరణ్యంలో దొరుకుతున్న దంటావా?" అని అడిగాడు కావా.

"అంతా ఎక్కడ దొరుకుతున్నదిలే! దొరికితే నెలకొక షేర్‌ఖాన్‌ను చంపక పోయానా? వానా కాలంలో ఎండా, ఎండా కాలంలో వానా వస్తే ఎంత బాగుండును! కడుపు మాడేటప్పుడు ఒక మేక దొరక్క పోయెనే అనిపిస్తుంది. మేక దొరికితే అది లేడి కాకపోయెనే అనిపిస్తుంది. లేడి దొరికితే అది దున్న కాకపోయెనే అనిపిస్తుంది. అందరికీ అంతే?" అన్నాడు మోగ్లీ.



"నీ కింకే కోరికాలేదా?" అని కావా అడిగాడు.

"అరణ్యం తీర్చలేని కోరికంటూ ఏ ముంది?" అన్నాడు మోగ్లీ.

"ఆ తాచు చెప్పటం—" అని కావా ప్రారంభించాడు.

"ఏ తాచు? ఆ తాచు ఏమీ చెప్పనే లేదే?" అన్నాడు మోగ్లీ.

"నీరుతాగి పోయిన తాచుకాదు, ఇంకో తాచులే," అన్నాడు కావా.

"నువ్వు విషపుపురుగులతో స్నేహం కట్టవసు ఉంటావే! నువ్వే పడగతో మాట్లాడావు?" అని మోగ్లీ అడిగాడు.



"మూడు, నాలుగు వేట లవుతుంది. శిథిలాలలో వేటకు వెళ్ళాను. నీకా చోటు జ్ఞాపకం ఉండే ఉంటుంది. అక్కడ నే నొక సొరంగంలో వేట చేసి, చిన్న కునుకు తీశాను. తరవాత నిద్రలేచి, ఆ సొరంగం కుండానే ఇంకా ముందుకు పోయేసరికి ఒక తెల్లపడగ కనిపించింది. అతను నాకు తెలీని విషయాలెన్నో చెప్పాడు, నే నెప్పుడూ చూడనివి ఎన్నో చూపాడు," అన్నాడు కా.

"కొత్తరకం ప్రాణులా? వేటాడ దగిన వేనా?" అని మోగ్లీ ఆసక్తితో అడిగాడు.

"వాటిని వేటాడడు. వేటాడితే పళ్ళన్నీ ఊడి చక్కాపోతాయి. మనిషి అయిన వాడు వాటిని చూడటానికి ప్రాణాలైనా అర్పిస్తాడట, తెల్లపడగ అన్నాడు," అన్నాడు కా.

"పోయి చూద్దామా ఏం? నేను కూడా ఒకప్పుడు మనిషినేగా?" అన్నాడు మోగ్లీ.

"అబ్బే, అబ్బే! ఆ తెల్లపడగ ఎంత వయసనుకున్నావు? అరణ్యమంత వయసు! అతనితో నిన్ను గురించి చెప్పాను. తాను మనిషిని చూసి చాలా కాలమయిందిట. నిన్ను తీసుకురమ్మన్నాడు. అక్కడ ఉన్న వస్తువులు చూడటానికే మనుష్య ప్రాణాలైనా బలి పెడతారుట!" అన్నాడు కా.

"అదేదో వేటాడదగినదే అయి ఉండాలి," అన్నాడు మోగ్లీ.

"కానే కాదు. అది—దాన్ని ఎట్లా వర్ణించాలో నాకు తెలీటంలేదు," అన్నాడు కా.

"అక్కడికి పోదాం. నే నెన్నడూ తెల్ల నాగును చూడలేదు. అతను వాటిని చంపేసి ఉంటాడా?" అని మోగ్లీ అడిగాడు.

"వాటికి ప్రాణం ఉండదు. అతను వాటికి రక్షకుడుట!" అన్నాడు కా.

"పోదాం పద," అంటూ మోగ్లీ నీటిలో నుంచి బయటికి వచ్చి, ఒళ్ళు తడి ఆరటానికి గడ్డి మీద పొర్లిగింతలు పెట్టాడు.

తరవాత ఇద్దరూ కలిసి శిథిలాల కేసి బయలుదేరారు.



# 76. జపాను "తోరణం"

జపానులోని ప్రసిద్ధ షింటో ఆలయాలకు ద్వారాలుగా ఇలాటి తోరణాలు కొన్ని ఉన్నాయి. ఇక్కడ చూపిన తోరణం ("తోరియి") ఇత్సుకుషిమ పుణ్యక్షేత్రానికి ద్వారం. ఈ పుణ్యక్షేత్రం, అణుబాంబుతో ధ్వంసమైన హిరోషిమ నగరానికి నైరృతి దిశగా ఉన్నది. ఈ తోరణాన్ని కర్పూరవృక్షపు చెక్కతో తయారు చేశారు. ఇది హిరోషిమ అఖాతం మీద 50 అడుగుల ఎత్తు నిలిచి ఉన్నది.



Photo by O. P. Sharma



బహుమతి
పొందిన వ్యాఖ్య

కుసుమగుచ్ఛము

పంపినవారు,
వి. రాజారావు, జనగాం

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 మే నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలించబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకూ కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కుసుమగుచ్ఛము

రెండవ ఫోటో: కంటకమయము

పంపినవారు: ఎ. రాజారావు,

బనగాం. మధిర తాలూకా (ఖమ్మం జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/-ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: "CHAKRAPANI"

# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారణ చేసుకోడానికి ఒకటే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా బెణుకులకు కండరాల నొప్పులకు తలనొప్పికి ఇంకా తీక్ష్ణ నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెలమంటకు పారాశల జలుబులకు కూడా మంచి మందు కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతా కలిసి నెలల తరబడి వస్తుంది. అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ళ ప్రసిద్ధి పొందిన నమ్మకమైన గృహ ఔషధం.

**అమృతాంజన్ నొప్పుల జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు**

బెణుకునొప్పి

ఎంత ఎక్కువగా ఉన్నా

బెణికినచోటే కదా!




అమృతాంజన్ లిమిటెడ్

మద్రాసు - బొంబాయి కలకత్తా ఢిల్లీ

# ఫోస్‌ఫోమిన్



శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.



సహనశక్తిని హెచ్చించును.

శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్‌ఫోమిన్ ...బి కాంప్లెక్స్ విటమినులు మరియు
గ్లిసరోఫోస్ఫేట్లుగల అనుపమ్యమైన పండ్ల రుచిగల టానిక్




SQUIBB

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A/67 Tel



# గోపాలుని రహస్యం


మధు: కొత్త స్టాంపా? ఏ దేశానిది?
గోపి: భారతదేశానిదే


మధు: కొయ్యకు కోతలు. మనదేశపు స్టాంపులన్నీ నాకు తెలుసు. ఇదెప్పుడూ నేను చూడలేదు.
గోపి: నీ వెప్పుడు పొదుపు చెయ్యలేదు గనుక చూసి వుండక పోవచ్చు. ఇది సేవింగ్సు స్టాంపు...


...నా పాకెట్ మనీ నుండి 25 పైసలకు, 50 పైసలకు ఈ స్టాంపులు కొంటాను. వాటిని ఈ కార్డుమీద అతికిస్తాను. తర్వాత ఈ కార్డును పోస్టాఫీసుకు తీసుకెళ్తాను....


....ఆ డబ్బు నా సేవింగ్సు ఎకౌంటులో జమ అవుతుంది. నా పేరిట ఇప్పటికే 42 రూపాయలున్నాయి.
SAVINGS


మధు: అరె. ఈ ఐడియా బలేగా వుందోయ్. ఒకవేళ నీదగ్గర ఐదో, పదో పైసలుంటే ఖర్చయి పోతుందన్న మాటేగా.


గోపి: ఊహూఁ ఎందుకవుతుంది. ఈ సేవింగ్సు పెట్టెలో వేస్తాను. నీకు తెలుసా? ఈ డబ్బంతా పెట్టి వచ్చే నెలలో క్రికెట్ సెట్ కొనుక్కుంటాను.


మధు: చాలా బాగుంది. నేను ఫుట్‌బాల్ కొనుక్కోవాలని చాల రోజులుగా అనుకొంటున్నా. మా నాన్న గారినికూడా నాకో సేవింగ్సు పెట్టె కొనమంటాను.





# AWARDS!

# WON PLENTY

## YET WE DON'T SAY
## WE ARE THE BEST
### ONLY
## WE DO OUR BEST



**PRASAD PROCESS PRIVATE LTD**

CHANDAMAMA BUILDINGS MADRAS-26

